# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

వ్యవస్థాపకులు : విద్వాన్ బులుసు సీతారామ శాస్త్రి.

సంపుటము 13 | రాజమహేంద్రవరము 16-7-1990, 1-8-1990 | సంచికలు 18, 19


—* ఈ సంచికలో *—




1, 16 తేదీలలో ప్రచురింపబడును



విడి ప్రతి 0-60 పై.

సంవత్సర చందా రు. 12-00

6 మాసములకు రు. 6-50




కీ॥ శే॥ విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారు

రాబోవు సంచికలో :-

1. కృష్ణ కర్ణామృతం
2. ప్రాచీన సాహిత్యామృతం : రామరాజభూషణుడు - ఒక పరిచయం
3. భరతమాత
4. అడవి (కవిత)
5. సింహావలోకనం (గ్రంథ విమర్శ)
6. మహాకవి శ్రీ బులుసు వేంకటేశ్వరులు
7. ప్రసిద్ధ ద్రావిడభాషల్లో తద్భవాజ-ధ్వనిసూత్రాలు

మొదలగునవి ఉంటాయి.

# సంపాదకుని మాట



ఒక వ్యక్తి స్వయంకృషితో ఒక సంస్థగా రూపొందడం చాలా అరుదుగా జరుగుతూ ఉంటుంది. విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారు ఒక వ్యక్తికాదు, ఒకసంస్థ. అటు తాను నమ్మిన వేదశాస్త్రాలను మననం చేసుకుంటూ జీవితంలో ఎవరికైనా చేతనైన ఉపకారమే చేస్తూ ప్రాచుర్యం కోసం ప్రాకులాడకుండా ఎంతటి కష్టాలనైనా చిరునవ్వుతో ఎదుర్కొన్న ధీశాలి. తెలుగును తెలుగుగా ఉంచాలని నిష్కపటంగా నిక్కచ్చిగా చెప్పిన మహానుభావుడు. చక్కటి పాండిత్యం, కవితాశక్తి కలిగి ఉండికూడా అజ్ఞాతంగా ఉండిపోయిన ఎందరో మహానుభావుల్లో ఆయనొకరు. సాహిత్యపరమైన పత్రికను ఎన్ని కష్టనిష్ఠూరాల కోర్చియైనా నడపాలనేది ఆయన జీవితంలో పైకి చెప్పుకున్న వాంఛ. ఆయన సంస్మరణ సంచిక ఆయనకు మా చిన్ని జ్ఞాపిక.

ఆయన శక్తిసామర్థ్యాలలో అణుమాత్రమే ఉన్నా ఆయన ప్రారంభించిన సమాలోచన చిరకాలం నడపాలనేదే మా వాంఛ. కొద్దిమంది సాహితీ మిత్రుల సహకారంవల్ల అది సాధ్యపడుతోంది. ఈ సహకారం మరికొంచం అధికంగా లభిస్తే సమాలోచన ఇంకా సుందరంగా మీ ముందు ఉంటుంది.

సమాలోచనలో చేసిన విజ్ఞప్తికి వెంటనే స్పందించి ప్రాచీన సాహిత్యంపై రచనలు పంపించారు. రాబోవు సంచికల్లో ఆ మంచి రచనలు ప్రచురణ అవుతాయి. పాఠకుల ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు.

— సంపాదకుడు

వ్యవస్థాపకులు: కీ॥ శే॥ విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారి సంస్మరణ సంచిక

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

**Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.**

## సాహితీమూర్తులు, వేదవిదులు, రసహృదయులు

## బ్రహ్మశ్రీ బులుసు సీతారామశాస్త్రిగారి ప్రథమ వర్ధంతి సందర్భములో



# స్మృత్యంజలి



తే॥ శ్రీ బులుసువంశ వారాశి శీతకిరణ
సదయమూర్తి సీతారామశాస్త్రివర్య
గడచె నొక వత్సరమ్ము నీకాలగర్భ
మందు నైనను నిన్నెట్లు మఱువగలము

తే॥ విస్తులంబైన హైవ్ పండిట్స్ గైడు
నీ సమాలోచనమ్ము సందీప్త పత్
త్రిక సంపాదకత్వమ్ము బహువిధముల
జ్ఞప్తి చేయుచు నుండు మా స్వాంతమందు

సీ॥ వేదవేదాంగ సద్విజ్ఞానివై యుండి
శ్రీ వేదవిదుల పోషించినావు
కవితాచమత్కృతిన్ కమనీయ కావ్యముల్
సృష్టించి నీవు విశేషముగను
వీరేశలింగ సద్విద్యాలయంబున
నాచార్యపదవిచే నలరినావు
తెలుగు విద్యార్థికి వెలుగునిచ్చెడి హైవ్
పండిట్స్ గైడ్ నేర్పరచినావు

తే॥ సుంత మొగమాటమును లేక స్వాంతమందు
సత్యము వచించునట్టి విశాలహృదయ
సారసాక్షుడు నీకాత్మశాంతి నీయ
ప్రార్థనము సేతు మెవ్వేళ భావమందు

ఉ॥ శాంతవిగర్వ భావజనసమ్మతి సాత్త్విక సామరస్య సి
ద్ధాంతములన్ మహోన్నతపథంబున సాగినదీవిశాల నీ
యంతటి ధర్మమూర్తి నిక గారయలేమని దుఃఖపూరిత
స్వాంతులమైతి మాత్మకును శాంతిని గోరెదమీ మహోదయా

సంతత మిట్టి సజ్జనుల సచ్చరిత శ్రవణానురక్తి వ
ర్ధంతి మహోత్సవంబుల విరాజిలఁజేయుచు తెన్గువారు సు
స్వాంతముతోడ నిట్టిగుణవంతుల మార్గమునం జరించి ధీ
మంతులు మెచ్చురీతి ఋజుమార్గమునం దయవింత్రు గావుతన్

— శ్రీ బులుసు వేంకట రామమూర్తి

# 1. కర్పూర వసంతరాయలు కావ్యంలో ఛందోవైవిధ్యం

—శ్రీ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి, ఎం.ఏ., ఎం.ఫిల్.,

గద్యం, పద్యం, గేయం, వచనకవిత- మొదలైన కవితా వాహిక లన్నింటిలోనూ హృద్యమైన రచనలు చేసి, జ్ఞానవయోవృద్ధులైన పండిత ప్రకాండుల ప్రశంసాశీస్సుల నందుకొన్నప్పటికీ, "ఎన్ని తెన్నుల కైతకన్న విహరించినను పాటలో పలికేస్తే ప్రాణాలు గలవందు" అంటూ, గేయం పట్ల తన మన్ననను వెల్లడించిన గేయకవి డా॥ సి. నారాయణరెడ్డిగారు. వారు నాగార్జున సాగరం, విశ్వనాథ నాయకుడు, కర్పూర వసంతరాయలు లాంటి అనేక గేయకావ్యాలు రచించారు. 'కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసః' అన్నట్లుగా వాటన్నింటిలోకీ 'కర్పూరవసంతరాయలు' తలమానికం. నారాయణరెడ్డిగారి రసప్రపంచమంతా ఏకత్ర రాశీభూతమైవున్న కళాఖండ మది. ఆ కావ్యానికంతటి ప్రశస్తి రావటానికి కారణాలు అందులోని ఇతివృత్తం, దాన్ని అనన్యసాధ్యంగా నిర్వహించిన రెడ్డిగారి కవన చాతుర్యం. ఈ చాతుర్యంలో అనేక కోణాలున్నాయి. వాటిలో ఛందోవైవిధ్య మొకటి.

పద్యాలలో ఛందస్సు వృత్త జాత్యుపజాత్యాది భేదాలలో నడుస్తుంది. కాగా, గేయాలలో త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్రాది గతులలో నడుస్తుంది. త్రిశ్రగతిలో ఒక్కొక్క పాదంలో మూడు మాత్రల గణాలు నాలుగు, చతురశ్రగతిలో నాలుగు మాత్రల గణాలు నాలుగు, ఖండగతిలో ఐదు మాత్రల గణాలు నాలుగు, మిశ్రగతిలో మూడు+నాలుగు+మూడు+నాలుగు మాత్రల గణాలు వుంటాయి, కొన్ని గేయాలలో వీటికి రెట్టింపు - పాదానికి ఎనిమిది గణాలు వుంటాయి. నాలుగు గణాలున్న పాదాలలో ప్రథమ తృతీయ గణాద్యక్షరాలకు, ఎనిమిది గణాలున్న పాదాలలో ప్రథమ పంచమ గణాద్యక్షరాలకు యతి చెల్లుతుంది. యతికి బదులుగా ప్రాసయతిని కూడ పాటించవచ్చును.

నారాయణ రెడ్డిగారు తమ 'కర్పూర వసంతరాయలు'లో ఈ గతుల నన్నింటిని ప్రయోగించారు. కొన్ని సందర్భాలలో వీటికి భిన్నమైన గతులను కూడ ప్రయోగించారు. అంటే పాదంలో నాలుగు గణాలకు బదులు ఒకటి, రెండు, మూడు గణాలను మాత్రమే ప్రయోగించిన సందర్భాలున్నాయి. కొన్నిచోట్ల ఒక్కొక్క గణంలో మాత్రలను పెంచటమూ, తగ్గించటమూ చేశారు. వారు ఈ ప్రయోగాలను ఉద్దేశపూర్వకంగానే చేశారు.

ఐదు ఆశ్వాసాల ఈ కావ్యంలో మదనోత్సవం నుండి ఆత్మాహుతి వరకు అనేక ఘట్టాలున్నాయి. రెడ్డిగారు ఒక్కొక్క ఘట్టం మారినప్పుడు నిత్యంగా కాదుగాని, వికల్పంగా - ఒక్కొక్క గతిని మారుస్తూ కథాకావ్య సౌందర్యాన్ని సమకూర్చారు.

*　　*　　*　　*

జయ జయ సముగ్రాంధ్ర
సర్వం సహాధర
సంభరణ శేషాహిరూపా!
పరిపంథి నృపతి దో
ర్బల కంధ మంథనా
పరమందరాద్రి స్వరూపా! (పుట. 31)

చైత్రశుద్ధ త్రయోదశి, మదన పూజారంభ సమయంలో కొండవీటి ప్రభువు కుమారగిరి రెడ్డికి మాగధులు పలికే ఈ కైవారాలతో కావ్యారంభం జరిగింది. ఈ ఘట్టంలోని గేయ ఖండా లన్నీ ఖండగతిలో నడిచాయి.

ఆ సందర్భంలోని వసంత రాయల సౌందర్యాన్ని, అతని వెనుక బారులు బారులుగా వస్తున్న అశ్వికాది దళాలను, కాటయ వేమునిని, పౌరులను రెడ్డిగారు మిశ్రగతిలో వర్ణించారు.

పాలసంద్రపు నురుగు తరగలు
పరిమళించిన సురగజముపై
స్వారి వెడలు శచీద్వితీయుని
స్మరింపించె వసంతరాయుడు. (పుట 33)

ఐరావతాన్ని అధిరోహించిన దేవేంద్రుడిని గుర్తుకు తెస్తున్న వసంతరాయల రాజసమూర్తిని ముగ్ధాంగనలు అంతఃపుర గవాక్షాలనుండి తిలకిస్తున్న దృశ్యం త్రిశ్రగతిలో నడిచింది.

ఒక్క తలుపు రెక్క తీసి
ఓయారముగ అణుమధ్యలు
మధ్యలు తిలకించినారు
మహీశ్వరుని యౌవమూర్తిని (పుట. 35)

రాజా, రాణి, కాటయ వేమాను నగరి తోటలోని తియ్యమామిడి చెట్టుక్రింద నిర్మించబడిన వేదిక దగ్గరకు వచ్చారు. బావ మఱదులిద్దరు సరససల్లాపా లాడుకొన్నారు. ఈ సందర్భం మిశ్రగతిలో నడిచింది.

కాళిదాసు శకుంతలను పా
లాలు చేర్చెదు బావగారూ!
మీ రసజ్ఞత మదనదేవ స
మీప వర్తిని కాదనెదరా? (పుట. 38)

తర్వాత కుమారగిరి మహాహార్తికలైన విప్రమండలి సూచన ననుసరించి గణపతిని, పరమేశ్వరుడిని, మన్మథుడిని

పూజించాడు. ఈ పూజా విశేషాలన్నీ త్రిశ్రగతిలో నడిచాయి.

గుప్పెడంత కుంకుమ పొడి
గుప్పెను అచ్చరలపైన
దోసెడన్ని పూవు లెత్తి
పోసెను మధుమూర్తిపైన. (పుట. 38)

తొమ్మిది రోజులు జరిగిన మదనోత్సవాలలో జానపదులాలపించిన గీతి విశేషాలను, నృత్త నృత్యాలను రెడ్డిగారు చతురశ్రగతిలో వివరించారు.

జాదర జాదర జాదర యంచును
'చర్చరి గీతుల' పాడెడు వారలు
ద్రుత తాళమ్మున ధుంతక ధుంతక
ధుంధుం కిట యని ఆడెడు వారలు.
(పుట. 40)

చైత్రపూర్ణిమనాడు నగరోద్యానంలో జరిగిన నాట్య ప్రదర్శనలో కుమారగిరికి లకుమా సందర్శనమైంది. ఈ ఘట్టాన్ని రెడ్డిగారు ఖండగతిలో నడిపారు. కొన్ని గేయఖండాలలో చివర గణం పంచమాత్రలది. కాగా, మరి కొన్నింటిలో త్రిమాత్ర, ఏకమాత్ర గణాలున్నాయి.

చైత్ర పూర్ణిమనాడు జాబువెన్నెల రేడు
ఉదయించినాడదో మదనునకు సైదోడు
(పుట. 41)

.... .... ....

ఇంతలో యవని కాభ్యంతరమ్మున నుండి
వినిపించె వాద్యమేళమ్ము
తోటలో నిదుర మత్తునను న్న గడ్డిపో
చలు లేచి చూచినవి సుమ్ము. (పుట. 43)

... ... ...

గరుడుని గరుత్తులటు కరములెత్తి పతాక
హస్తముద్రను చూపినది నర్తకి
(పుట. 48)

రాజు లకుమా సౌందర్యాకృష్టుడు, తల్లగ్న పంచప్రాణుడయ్యాడు. విరహవేదన వలన నిద్రకు దూరమైనాడు. అతని ఈ స్థితి త్రిమాత్ర గణాలలో నడిచింది.

నేల నిదురవోయె
నింగి నిదురవోయె
గాలి నిదురవోయె రేడా
కండె అదరిపోయె. (పుట. 59)

కుమారగిరి లకుమా సమేతుడై అహోబల దక్షవాటికాది పుణ్యక్షేత్ర పర్యటన చేసి వచ్చాడు. రాణి స్థానంలోవున్న లకుమను చూచి ప్రజలు గుసగుసలాడుకో సాగారు. మరునాడు కాటయవేముడు కుమారగిరి వద్దకు వచ్చి, తాను తలపెట్టిన జైత్రయాత్రను గురించి వివరించాడు. ఈ వివరణ నంతటిని రెడ్డిగారు త్రిశ్రగతిలో నడిపారు.

విజయనగర మెపుడు కొండ
వీటి ప్రక్కలో బల్లెము;
దానికి సైదోడుగ సు
ల్తాను బహామనీ రాజ్యము.
(పుటలు. 109,110)

మొట్టమొదట లకుమా నాట్యానికి ముగ్ధుడైన రాయడు తర్వాత కాలంలో ఆమె తనూ లావణ్యానికి దాసుడయ్యాడు. అతని జీవిత నౌకకు లకుమ చుక్కాని అయింది ఆమె అతనికి పంచభూతస్వరూపిణిగా కనిపించిన వైనాన్ని రెడ్డిగారు ఖండగతిలో నిరూపించారు.

పృథ్వి నాయమ జఘన పీఠమ్మునం జూచి
జల మామె కంటిపాపల లోతులం జూచి
తేజమ్ము నామె ముఖ రాజీవమున గాంచి
వాయుగతి నామె నిశ్వాసముల
గుర్తించి
ఆకాశ మామె మధ్యము నందు గమనించి
నిఖిల సృష్టికి లకుమనే ప్రతీకగ నెంచి.
(పుట. 114)

యుద్ధయాత్రను [illegible] విజయవంతంగా ముగించుకొని వచ్చిన కాటయ వేముడు రాజుగారి పరిస్థితిని, రాణి దుస్థితిని తెలుసుకొని, కుమారగిరికి హితబోధ చేశాడు. ఈ బోధ త్రిశ్రగతిలో నడిచింది.

మీకు చెప్పదగిన శక్తి
నాకు లేదు మహా ప్రభూ!
అయిన నొకటి రెండు మాట
లన సాహస మొనరించెద.

... .... ...

మానలేని ఒక వేదన
చే నిపీడ్యమాన యగుచు
మహారాజ్ఞి యేమి చెప్ప
మంచము పట్టెను బావా! (పుట. 127)

కాటయ వేముని బోధ, అభ్యర్థనల ఫలితంగా తప్పనిసరై కొలువు కూటానికి వెళ్ళిన రాజు 'లకుమకు కాలు బెణికెం' అనే వార్త విని, కొలువు కూటాన్ని వదిలి, ఆమె సన్నిధికి వచ్చి -

ప్రియా! నీదు కాల్మ్రొకె
బెణకి పోపలేను సుమా!
నా జీవ నవామృత భాం
డమే తొణకినది లకుమా! (పుట. 184)

అంటూ బాధ పడ్డాడు. అతనికి తన పట్లగల అభిమానానికి, అతని పసిపిల్లవాని మనస్తత్త్వానికీ పొంగి పోయిన లకుమ -

వెన్నయైన గట్టి పడుట
యున్నది గానీ స్వామీ!
మెత్తదనము దప్పు మీదు
చిత్తము అన్య మెరుంగదు
నేను పునర్జన్మ మెత్తి
లేని ప్రభూ! రసికతా మ
హోలయమా మీ యువహృద
యముగా జన్మింతు గాత (పుట. 186)

అంటూ తన కృతజ్ఞతను తెలుపుకొన్నది. ఇదంతా త్రిశ్రగతిలో నడిచింది.

లకుమ కోసం కుమారగిరి కొలువు కూటాన్నే వదలివెళ్ళాడనే వార్త రాణి హృదయానికి విషవాయు వీచిక లాగా

పోయింది. చిన్నప్రేమికుడూ తాను కాబోయే చింతతో సుగమైన రాణి సాక్షాత్కరించటానికి కాటయవేముడు వచ్చాడు. ఆమె తన మనోవ్యథ నతనికి విన్నవించుకొన్నది. ధర్మశాస్త్ర జగత్తుకి మణిదర్పణాలైన ఆమె కరుణోదాత్త వాక్కులను విన్న వేముడు ఆమెను ఓదార్చాడు. ఈ ఘట్టమంతా మిశ్రగతిలో నడిచింది.

ఇన్ని నాళ్ళుగ నారూపదను దహి
యించు బాధను దాచియుంచితి
ఈ దినమ్మున మాత్ర మన్నా!
ఏలకో చలియించి పోయితి (పుట.189)

... ... ....

మనది ఒక సత్ సంప్రదాయము
మన చరిత్రము శ్రవణ పేయము
మన కులమ్మున కింత వరకును
మహీ సంరక్షణమె ధ్యేయము.
(పుట. 140)

కాటయవేముడు మళ్ళీ కుమారగిరి వద్దకు వెళ్ళి, హితోపదేశం చేశాడు. రెడ్డిగారు ఈ బోధలో కొంత భాగాన్ని ద్విపదనడకలోనూ, మరికొంత భాగాన్ని ఖండగతిలోనూ నడిపారు.

భూదేవి కవతారమా రాణి
పొగిలి మంచము పట్టె నో మహీజాని!

.... .... ....

మదిలోని ఆశలు జడిసిపడె నామె
కడసారి మిము జూడ కాంక్షించె నామె

.... ... ...

కడకు దేశమ్ము కొరకైనను సరే మీరు
అర్ధాంగ లక్ష్మి నోదార్చగా పోవలయు.
(పుట. 142)

కాటయవేముని బోధ విఫలమైంది. అనుమ రాజువద్దకు వచ్చి, రాణిసన్నిధికి వెళ్ళవలసిందిగా అతడికి చెప్పింది. రాజు అనుమపట్ల తనకుగల ప్రేమాతిరేకాన్ని విస్పష్టంగా ఆమెకు వివరించాడు. ఈ సందర్భం మొత్తమూ త్రిశ్రగతిలో నడిచింది. ఐతే, ఇందులో చతురశ్రగణాలు మూడున్న చోట స్పష్టంగా కనిపించటం విశేషం.

ఎవరెంతగ నన్నను రమ
ణీ! నా చిత్తము మారదు
నీదు సాహచర్య చికీ
ర్షా దాహము చల్లారదు

.... ... ....

దేశ మ్మైనను సరి
రోయశశి బింబ ప్రతి బిం
బమ్ముగు నీ యానన బిం
బమ్ము శరణ్యమ్ము నాకు.
(పుటలు. 144/145)

ఒక అర్ధరాత్రి రాణి రాజుగారి కేళీ సౌధరత్న ప్రాంగణానికి వెళ్ళి, అనుమను పిలిచింది. అనుమవచ్చి, రాణిని చూచి, ఆశ్చర్యచకిత అయింది. ఆమెకు పాదాభివందనంచేసి, వల వల ఏడ్చింది. రాణి ఆమెను లేవనెత్తి, పైటతో ఆమె అశ్రువులను తుడిచింది. 'రాణి వచ్చిన పనిని నెరవేర్చటానికి తన ప్రాణాలనైనా సరే, అర్పిస్తా' నని అనుమ వాగ్దానం చేసింది. అప్పుడు రాణి –

నీపయిన్ ఒక ఘోరభారము
మోపగా వచ్చితిని తల్లీ!
పాల మునుకవో నీట మునుకవో
బాధ్యతను గమనించి తల్లీ! (పుట. 149)

అని ప్రారంభించి, 'రాజును విడిచి ఎక్కడికైనా వెళ్ళిపోవలసింది' గా ప్రాధేయపడి, తన మందిరానికి వెళ్ళిపోయింది. ఆ మాటలను విన్న అనుమ తన రొమ్ములో పిడుగుపడినట్లుగా చలించిపోయింది.

ఎటుల వాగ్దానమ్ము తీర్తును
ఎటుల రాయని వీడు నేర్తును
ఎంత కీ త్యాగమ్ము నిచ్చితి
వీశ్వరా! ఈ పాపిజాతికి (పుట. 151)

అంటూ విలపించింది. చివరికొక నిర్ణయానికి వచ్చింది. ఉజ్జ్వలమైన ఈ ఘట్టాన్ని రెడ్డిగారు మిశ్రగతిలో నడిపారు.

మరునాడు అనుమ తన రమ్యశరీరం నుండి చండికా భయద సౌందర్యకాంతులు పిసాళించే విధంగా, పరమ శివుని లాగా అలంకరించుకొని నాట్యంచేసింది. కుమారగిరికి ఆమెలో అపర సంధ్యామూర్తి దర్శన మిచ్చాడు. ఆమె నాట్యం చేస్తూనే ఒడిలోనుండి పిడి బాకుతీసి, తన రొమ్ములో పొడుచుకొని, నేలపై పడ్డ కూలిపోయింది. రాజు చివాలునలేచి, ఆమె వద్దకు వెళ్ళాడు. అతని కామె ముఖంలో రాహు గ్రహగ్రస్త చంద్ర బింబాంతస్థ చరమ కళ కనిపించింది. అతడు ఆ బాకు ఊడబెరికాడు. దాని పిడికొక లేఖ చుట్టివున్నది. రాజు అందులోని రక్తసిక్తాక్షరాలను చదివాడు. అనుమ సందేశాన్ని చదివిన కుమారగిరి రెడ్డి జాగృతుడైనాడు. ఈ ఘట్టమంతా ఖండగతిలోనే నడిచింది.

ప్రభుని కన్నులకప్పుడె
నపుడు కొండ నీ
దుడుకు మహారాష్ట్రయును జన
మహాంభోధియును. (పుట. 156)

ఈనాటికీ కొండవీటిలో వీచేగాలులు అనుమ అందాల ఝణఝణత్కారాలను వినిపిస్తుంటాయంటారు రెడ్డిగారు.

జయ జయ సమగ్రాంధ్ర
సర్వం సహాభార
సంభరణ శేషాహిరూపా! (పుట. 81)

అంటూ ఖండగతిలో కావ్యాన్ని ప్రారంభించిన రెడ్డిగారు—

(తరువాయి 6వ పేజీలో)

# 2. హరిగోవిందా!

(ఆదిశంకరులవారి భజగోవింద స్తోత్రానికి తెనుగుసేత)

—శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు

1. భజగోవిందం భజగోవిందం
   భజగోవిందం మూఢమతే ।
   సంప్రాప్తే సన్నిహితే కాలే
   నహి నహి రక్షతి డుకృఞ్ కరణే ॥భజ

1. హరిగోవిందా హరిగోవిందా
   హరిగోవిందా అనరా మందా!
   మరణాసన్నంబౌ తఱి నిన్, వ్యా
   కరణ మ్మెంచుకయున్ కావదురా ॥హరి

* * *

2. మూఢ! జహీహి ధనాగమ తృష్ణాం
   కురు సద్బుద్ధిం మనసి వితృష్ణాం
   యల్లభసే నిజ కర్మోపాత్తం
   విత్తం తేన వినోదయ చిత్తమ్ ॥భజ

2. మూఢా! వదలుము ధనదాహమ్మును
   వీడుము కోరికలను చిత్తమ్మున
   పొందెదు కర్మఫలితమున ధనమును
   చెందుము దాననె మోదము మనమున ॥హ

* * *

3. నారీస్తనభర నాభీదేశం
   దృష్ట్వామాగా మోహావేశం
   ఏతన్మాంస వసాది వికారం
   మనసి విచారయ వారం వారమ్ ॥భజ

3. వనితాపటుకుచ నాభిప్రదేశము
   కనుగొని పొందకు మోహావేశము
   తనువిది మాంసవసాది వికారము
   మనమున మఱిమఱి చేయు విచారము ॥హ

* * *

4. నళినీ దళగత జలమతి తరళం
   తద్వత్ జీవిత మతిశయ చపలం
   విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తం
   లోకం శోకహతంచ సమస్తం ॥భజ

4. జలజదళముపై జలబిందువువలె
   నిలుకడలేనిది జీవితమంటే
   ఎరుగుమురా! లోకమ్మే సమస్తము
   దురభిమాన రుజ దుఃఖగ్రస్తము ॥హరి

* * *

5. యావద్విత్తోపార్జన సక్తః
   తావన్నిజ పరివారో రక్తః
   పశ్చాత్ జీవతి జర్జరదేహే
   వార్తాం కోఽపి న పృచ్ఛతి గేహే ॥భజ

5. ఎందాకుండునో ధనార్జనంబులు
   అందాకే పరిజన ప్రేమంబులు
   ఒంట్లో జవసత్త్వాలుడుగంటిన
   ఇంట్లో నిన్నడిగేవారుండరు ॥హరి

* * *

6. యావత్ పవనో నివసతి దేహే
   తావత్ పృచ్ఛతి కుశలం గేహే
   గతవతి వాయౌ దేహాపాయే
   భార్యా బిభ్యతి తస్మిన్ కాయే ॥భజ

6. ఒంట్లో ఊపిరి ఉండేవరకే
   ఇంట్లో కుశలప్రశ్నలు వేతురు
   ఒంట్లో ఊపిరి పోతే భార్యే
   ఇంట్లో ఉంచదు శవమును, భయపడి ॥హ

* * *

7. బాలస్తావత్ క్రీడాసక్తః
   తరుణస్తావత్ తరుణీసక్తః
   వృద్ధస్తావత్ చింతాసక్తః
   పరమే బ్రహ్మణి కోఽపి న సక్తః ॥భజ

7. పసితనమందున ఆటలు పాటలు
   మిసిమి వయసులో మెలతల మోజులు
   ముసలితనములో చింతల మూల్గులు
   హా పరబ్రహ్మము గను పెన్నడు ॥హ

* * *

8. కాతే కాంతా? కస్తే పుత్రః?
   సంసారోఽయమతీవ విచిత్రః
   కస్య త్వం వా? కుత ఆయాతః?
   తత్త్వం చింతయ తదిహ భ్రాతః ॥భజ

8. ఎవ్వతె పెళ్ళాం? ఎవడో బిడ్డడు?
   ఈ సంసారమ్మెంతో చిత్రము!
   ఎవరివాడ వెటునుండి వచ్చితివి
   తత్త్వమెరుంగర తమ్ముడ ఇక్కడె ॥హ

9. సత్సంగత్వే నిస్సంగత్వం
   నిస్సంగత్వే నిర్మోహత్వం
   నిర్మోహత్వే నిశ్చల తత్త్వం
   నిశ్చల తత్త్వే జీవన్ముక్తిః ॥భజ

---

(4వ పేజీ తరువాయి)

పేటికిని ఒకను అందాల ఝణత్కారములు
వినిపించు కొండవీటను వీచు వాయువులు
కొమరగిరి చరితమ్ము కొండవీటను తీర
మును సైతము వసంతముగ రూపుగట్టించు
కొండవీటను పొడుగొన్నట్టి మట్టిలో
సైతమ్ము కర్పూర సౌరభమ్ములు వీచు.
(పుట. 156)

అంటూ ఖండకృతిలోనే భవ్యంగా ముగించారు.

ఈ విధంగా డాక్టర్. సి. నారాయణ రెడ్డిగారు కర్పూర వసంతరాయలు[1] కథారథాన్ని వివిధగతులలో నడిపారు. దానివలన ఆ కథ ఒక్కొక్క ఘట్టంలో ఒక్కొక్క నడక నడుస్తూ, ఒక్కొక్క లయను ప్రదర్శిస్తూ సాగింది. రసజ్ఞపాఠక మనోనందన వనాలలో కర్పూర సౌరభాలను గుబాళింప జేసింది. కర్పూరవసంత రాయలు నారాయణ రెడ్డిగారి రసమయ హృదయానికి పతాక; వారి కవన కళా ప్రావీణ్యానికి ప్రతీక.

---

1. ఎమెస్కో ప్రచురణ, జూన్. 1972.

(*.*)

9. సత్సంగముచే నిస్సంగత్వము
నిస్సంగత్వమునన్ నిర్మోహము
నిర్మోహముచే నిశ్చలతత్త్వము
దానన్ జీవన్ముక్తి లభించును ॥హరి

* * *

10. వయసి గతే కః కామవికారః
శుష్కే నీరే కః కాసారః
క్షీణే విత్తే కః పరివారః
జ్ఞాతే తత్త్వే కః సంసారః ॥భజ

10. వయసుడిగిన ఎది కామవికారము
నీరింకినచో ఎది కాసారము
నిధులు తరిగితే ఏది పరివారము
తత్త్వ మెరిగితే ఎది సంసారము ॥హరి

* * *

11. మా కురు ధనజన యౌవనగర్వం
హరతి నిమేషాత్ కాలః సర్వం
మాయామయమిద మఖిలం హిత్వా
బ్రహ్మ పదం త్వం ప్రవిశవిదిత్వా ॥భజ

11. గర్వించకు ధన జన యౌవనమున
సర్వం బణచును కాలము క్షణమున
సర్వము బూటక మిది యని తెలియర
సర్వేశ్వరుగని సత్యమ్మెరుగర ॥హరి

* * *

12. దిన యామిన్యౌ సాయం ప్రాతః
శిశిర వసంతౌ పునరాయాతః
కాలః క్రీడతి గచ్ఛత్యాయుః
తదపి న ముంచత్యాశావాయుః ॥భజ

12. రే, పవలుల్, మునిమాపులు, రేపులు[1],
చలి, వేసవులు మరీమరి మారును
కాలక్రీడల గడచెను ఆయువు
ఐనా వదలదు ఆశా వాయువు
([1]రేపులు–వేకువలు)

* * *

13. కా తే కాంతా ధనగత చింతా
వాతుల కిం తవ నాస్తి నియంతా
త్రిజగతి సజ్జన సంగతి రేకా
భవతి భవార్ణవ తరణే నౌకా ॥భజ

13. ఏరా! ఇంతుల, ధనముల చింతలు
లేరా? చపలుడ! నీకు నియంతలు
లోకమ్ముల నౌక మంచి చెలిమియను
నౌకయ భవనీరధి దాటించును ॥హరి

* * *

14. ద్వాదశ మంజరికా మయ ఏషః
శిష్యాణాం కథితో హ్యుపదేశః
యేషాం చిత్తే నైవ వివేకః
తే పచ్యంతే నరకమనేకమ్ ॥భజ

14. ఈ ద్వాదశమంజరికా స్తోత్రము
శిష్యుల కుపదేశార్థము కథితము
మానవమందున దీని వివేకము
పూనక యుండిన నరకమనేకము ॥హరి

* * *

15. జటిలో, ముండీ, లుంఛిత కేశః
కాషాయాంబర బహుకృత వేషః
పశ్య న్నపిచ నపశ్యతి మూఢో
హ్యుదర నిమిత్తం బహుకృతవేషమ్॥భ

15. జడలుంచుట గుండ్లుగ గొరిగించుట
కత్తిరింపులూ కావిగుడ్డలూ
చూస్తూ నిజమును చూడరు మూర్ఖులు
పొట్టకోసరము పలువేసమ్ములు ॥హరి

* * *

16. అంగం గలితం పలితం ముండం
దశన విహీనం జాతం తుండం
వృద్ధోయాతి గృహీత్వా దండం
తదపి న ముంచత్యాశాపిండమ్ ॥భజ

16. అంగము జారును ఔదల నెఱయును
పళ్ళన్నూడియు నోరు తొఱ్ఱిదగు
ముదుసలియై చేబూనును దండము
వదల దప్పుడును ఆశాపిండము ॥హరి

* * *

17. అగ్రే వహ్నిః పృష్ఠేభానుః
రాత్రౌ చుబుక సమర్పితజానుః
కరతల భిక్ష స్తరుతల వాసః
తదపి న ముంచత్యాశాపాశః ॥భజ

17. ముందర అగ్గియు – వెనుకన సూర్యుడు
రాతిరిలో మోకాళ్ళకు గడ్డము
చేతి భిక్షమూ చెట్లనివాసము
ఐనా తెగదుగ! ఆశాపాశము ॥హరి

* * *

18. కురుతే గంగా సాగర గమనం
వ్రత పరిపాలన మథవా దానం
జ్ఞాన విహీన స్సర్వ మతేన
ముక్తిం న భజతి జన్మశతేన ॥భజ

18. గంగాసాగర సంగమ యాత్రలు
నోములు దానమ్ములు గావించియు
జ్ఞానవిహీనుం డన్ని మతమ్ముల
ముక్తిని బొందడు జన్మశతమ్ముల ॥హరి

* * *

19. సురమందిర తరుమూల నివాసః
శయ్యా భూతల మజినం వాసః
సర్వ పరిగ్రహ భోగ త్యాగః
కస్య సుఖం న కరోతి విరాగః ॥భజ

19. వాసము గుళ్ళూ-చెట్ల మొదళ్ళే
పానుపు నేలే-వస్త్రము తోలే
నిఖిల పరిగ్రహ భోగత్యాగము
సుఖమిడు నెంతో నిట్టి విరాగము ॥హరి

* * *

20. యోగరతో వా భోగరతో వా
సంగరతో వా సంగ విహీనః
యస్య బ్రహ్మణి రమతే చిత్తం
నందతి నందతి నందత్యేవ ॥భజ

20. యోగే అయినా భోగే అయినా
సంసారయినా సన్నాసయినా
ఎవని మనసు బ్రహ్మమును రమించునో
అత డమితానందమున వసించును ॥హరి

* * *

21. భగవద్గీతా కించి దధీతా
గంగాజలలవ కణికా పీతా
సకృదపి యేన మురారి సమర్చా
తస్య యమః కిం కురుతేచర్చామ్ ॥భజ

21. కించిత్తైనను గీతాగానము
కొంచెమైనను గంగాపానము
అంచితముగ పాపహరిహరి అర్చలు
ఆచరించిన మండవు యమచర్చలు ॥హరి

* * *

22. పునరపి జననం పునరపి మరణం
పునరపి జననీ జఠరే శయనం
ఇహ సంసారే బహు దుస్తారే
కృపయాఽపారే పాహిమురారే ॥భజ

22. మళ్ళీ మళ్ళీ పుట్టుట గిట్టుట
తల్లి కడుపులో మళ్ళీ ఉండుట
సంసారమ్మిది చాల దుస్తరము
కంసారీ! కృపగనుమ సత్వరము ॥హరి

* * *

23. రథ్యా కర్పట విరచిత కంథః
పుణ్యాపుణ్య వివర్జిత పంథాః
యోగీ యోగ నియోజిత చిత్తో
రమతే బాలోన్మత్తవదేవ ॥భజ

23. దారిబడిన పేలికలను దాలిచి
పుణ్యపాప విస్పృహగలవాడై
యోగమునందే యోగి రమించును
కుఱ్ఱవానివలె పెఱ్ఱివానివలె ॥హరి

* * *

24. కస్త్వం కోఽహం కుత ఆయాతః
కా మే జననీ? కో మే తాతః
ఇతి పరిభావయ సర్వమసారం
విశ్వం త్యక్త్వా స్వప్నవిచారం ॥భజ

24. నీవెవ్వరు? నేనెవ? రెటువచ్చితి?
నా అమ్మెవ్వరు? నా అబ్బెవ్వరు?
ఆలోచించిన అంతా స్వప్నము
లాంటిది విశ్వము వదలుము వట్టిది ॥హరి

* * *

25. త్వయి మయి సర్వత్రైకో విష్ణుః
వ్యర్థం కుప్యసి మయ్య సహిష్ణుః
భవ సమచిత్తః సర్వత్ర త్వం
వాంఛస్య చిరాద్యది విష్ణుత్వమ్ ॥భజ

25. నీలో నాలో అంతట విష్ణువె
ఓర్వలేని నీకోపము వ్యర్థము
అంతట సమభావుడవై ఉంటే
అప్పుడె విష్ణుత్వమ్మనుభవమగు ॥హరి

* * *

26. శత్రౌ మిత్రే పుత్రే బంధౌ
మా కురు యత్నం విగ్రహ సంధౌ
సర్వస్మిన్నపి పశ్యాఽత్మానం
సర్వత్రోత్సృజ భేదజ్ఞానం ॥భజ

26. శత్రువు హితుడు సుతుండు బంధువని
విగ్రహ సంధుల యత్నము చేయకు
అందరి యందున ఆత్మనె చూడుము
భేదభావ మంతట విడనాడుము ॥హరి

* * *

27. కామం క్రోధం లోభం మోహం
త్యక్త్వాఽత్మానం భావయకోఽహం
ఆత్మజ్ఞాన విహీనా మూఢా
స్తే పచ్యంతే నరక నిగూఢాః ॥భజ

27. కామము క్రోధము లోభము మోహము
వీడి- విచారింపుము నేనెవరని
ఆత్మజ్ఞాన విహీన మూఢులకు
యమలోకములో ఎన్నో గోడులు ॥హరి

* * *

28. గేయం గీతా నామసహస్రం
ధ్యేయం శ్రీపతి రూపమజస్రం
నేయం సజ్జన సంగే చిత్తం
దేయం దీన జనాయచ విత్తం ॥భజ

28. పాడుము గీతానామ సహస్రము
చూడుము మది హరిరూపమజస్రము
చేయుము సజ్జన సాంగత్యమ్మును
ఈయుము దీనులకొఱకు ధనమ్మును ॥హరి

* * *

29. పునరపి రజనీ పునరపి దివసః
పునరపి పక్షః పునరపి మాసః
పునరప్యయనం పునరపి వర్షం
తదపి నముంచ త్యాశామర్షం ॥భజ

(ఈ శ్లోకం ఉత్తరదేశ ప్రతుల్లో కొన్నిట కన్పిస్తుంది)

29. రేలు పవళ్ళు దినాలు పక్షమ్ములు
నెల లయనమ్ములు మరి వర్షమ్ములు
మళ్ళీ మళ్ళీ వచ్చెను వెళ్ళెను
బినా ఆశామర్షము త్రుళ్ళదు ।హరి

* * *

30. సుఖతః క్రియతే రామాభోగః
పశ్చాద్ధంతః శరీరే రోగః
యద్యపి లోకే మరణం శరణం
తదపి నముంచతి పాపాచరణం ।భజ

30. తగులుకొంచె మగువను మోహమ్మున
తెగులు తగులునయ్యోః దేహమ్మున
అందరకును భువి మరణమె శరణము
బినా వదలదు పాపాచరణము ।హరి

* * *

31. అర్థ మనర్థం భావయ నిత్యం
నాస్తి తతస్సుఖ లేశః సత్యం
పుత్రాదపి ధనభాజాం భీతిః
సర్వత్రైషా విహితారీతిః ॥భజ

31. ధనమే అనర్థమనుకో నిత్యము
దాన లేదు సుఖమింతయు సత్యము
ధనికుడు కొడుకునకైనను భయపడు
ఒకరును ఈవిధ మంత చెల్లపుడు।హరి

* * *

32. ప్రాణాయామం ప్రత్యాహారం
నిత్యానిత్య వివేక విచారం
జాప్యసమేత సమాధి విధానం
కుర్వవధానం మహదవధానం ।భజ

32. ప్రాణాయామము ప్రత్యాహారము
నిత్యానిత్య వివేక విచారము
జాప్య సమేత సమాధి విధానము
హెచ్చరికగ నిశ్చలముగ సేయుము॥హరి

* * *

33. గురు చరణాంబుజ నిర్భర భక్తః
సంసారా దచిరాద్భవ ముక్తః
సేంద్రియ మానస నియమాదేవం
ద్రక్ష్యసి నిజహృదయస్థం దేవమ్ ।భజ

33. గురు పాదాంబుజ భక్తుడ వగుమా
త్వరగా భవభయ ముక్తుడవగుమా
ఇంద్రియముల మది నిగ్రహించుమా
హృదయస్థిత పరమాత్ముని గాంచెదు॥హరి

—♦ సమాప్తం ♦—

# 3. శ్రీశ్రీకి తిలక్‌కూ భేదసాదృశ్యాలు

—డాక్టర్ మిరియాల రామకృష్ణ

'కవితారహస్యం కవికే తెలుసు' అని తిలక్ అంటూ కాళిదాసునుంచి శ్రీశ్రీ వరకూ నలుగురు కవుల్ని పేర్కొన్నప్పుడు కనీసం వారంతా ఒక కాలానికి గానీ ఒక ఆలోచనాధారకు గానీ ఒక వ్యక్తిత్వానికి గానీ చెందినవారు కారని మనకు తెలుసు. కృష్ణశాస్త్రి భావకవి; శ్రీశ్రీ అభ్యుదయ కవి. అయినా ఇద్దరిలోనూ ఉన్న కవితాశిల్పం అసమానమైనదే. ఈ శిల్పాన్నే తిలక్ 'రహస్యం' అంటున్నాడనిపిస్తుంది. ఈ శిల్పంలో చేరవి అనేకం ఉన్నాయి. ఇమేజరీ, వర్ణనలు, మాటలశక్తి, పదును, అర్థవంతమైన చిత్రణ, ఔచిత్యం, అంత్యప్రాసలు, మాటల కూర్పు వంటివి శిల్పంలోనే చేరతాయి. ఉపమాలంకారాన్ని బట్టి కాళిదాసును గొప్పకవి అన్నాం. వర్ణనచాతురిని బట్టి పెద్దన కవితా పితామహుడు, భావాభివ్యక్తిని బట్టి కృష్ణశాస్త్రి భావకవి మూర్ధన్యుడు. పదునైన మాటలనుబట్టి శ్రీశ్రీ అక్షరలక్షాధికారి. మరి తిలక్ దేనివల్ల అనితరసాధ్యమైన స్థాయినందుకున్నాడు? అతని వ్యక్తిత్వం ఏవిధమైన శిల్పంలో ప్రకాశిస్తోంది? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడం తిలక్ కవిత్వం చదివిన వారికెవరికీ కష్టంకాదు.

తిలక్ తనభావాలకు స్పష్టమైన ఆకారమిచ్చి, చిత్రలేఖకుడిలాగా పాఠకుల హృదయఫలకాలమీద నిల్పుతాడు. ఈ భావ చిత్రలేఖనం అతనికి వెన్నతో పెట్టినవిద్య. కవిత వ్రాయడానికుపక్రమించగానే అతని దృష్టిఅంతా మాట బొమ్మల మీదే ఉంటుంది.

"దారిపక్క చెట్టుకింద ఆరిన కుంపటి విధాన కూర్చున్నది ముసిల్దొకతె మూలుగుతూ ముసురుకున్న ఈగలతో వేగలేక; ముగ్గుబుట్టవంటి తలా ముడుతలు దేరిన దేహం కాంతిలేని గాజుకళ్ళు తనకన్నా శవం నయం" వంటి మాటబొమ్మలు శ్రీశ్రీ కవిత్వంలోఅక్కడక్కడా కనిపిస్తాయి. కానీ శ్రీ శ్రీ భావ చిత్రాలకే అంకితమయిన కవికాదు. అతని దృష్టి అంతా భావవిప్లవం మీద లగ్నమయి ఉంటుంది.

తిలక్ దృష్టిలో 'కవిత కొత్తఅనుభవాల కాంతిపేటికను తెరవాలి. కదిలించాలి. కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలి." అందుకే ఒక అద్భుతమైన అనుభవాన్ని కలిగించి, కదిలించడానికి తిలక్ ప్రయత్నించాడు సర్వదా, సర్వథా.

'గాజుకెరటాల వెన్నెల సముద్రాలూ
జాజిపువ్వుల అత్తరు దీపాలూ
మంత్రలోకపు మణిస్తంభాలూ
నా కవితాచందనశాలా సుందర చిత్ర
విచిత్రాలు'

అని స్పష్టంగా చెప్పుకున్నాడు తిలక్. "నా ఊహ చాంపేయమాల, రసరాజ్యడోల, నా ఊళ కేదారగౌళ గిరులు సాగరులు కంకేళికామంజరులు ఝరులు నా సోదరులు' అని చెప్పుకున్న శ్రీశ్రీతో తిలక్‌ను ఒక్కసారి పోల్చి చూస్తే ఎవరు చిత్రలేఖనానికి సన్నిహితులో ఎవరు సంగీతానికి సన్నిహితులో అర్థమవుతుంది.

నా విన్నది కన్నది విన్నవించగా
మాటలకై వెదుకాడగబోతే
అవి
శృంఖలానుశృంఖలంగా
శ్మశానాలవంటి నిఘంటువుల దాటి
వ్యాకరణాల సంకెళ్ళు విడిచి
ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి
వడిగా వడి వడిగా
వెలువడినై పరుగిడినై
నాయెద నడుగిడినై

అని శ్రీశ్రీ ఒక సుడిగాలిలా వస్తాంటే తిలక్ -

ప్రతిమాటకీ శక్తిఉంది, పదును వుంది
ప్రతిచిత్రణకీ అర్థంవుంది, ఔచిత్యంవుంది
అంటూ

నిగ్రహానుగ్రహాలు లేని భావాశ్వాలని బరిమీద పదలకు అని మలయమారుతంలా వీస్తూ మందలిస్తున్నాడు. చిత్రలేఖకుడికి ఉద్వేగం పనికిరాదు. రంగులతో పనిచేస్తూ రమణీయతను సృష్టించాలి. భావచిత్రాల రచనకు మాటలే రంగులు. ఆ మాటలు కూడా రూపకాలయి, ఉపమానాలయి, ప్రతీకలయి పని చేస్తూ ఉండాలి. ఇటువంటిచోట పదబంధాలెక్కువగా పనికివస్తూఉంటాయి.

తిలక్ రచించిన 'నెహ్రూ' ఖండిక ఒక పెద్ద విషాదదృశ్యంగా రూపొందింది.

ఈ కేళీ పువ్వులన్నీ వాడిపోయిన రోజు
ఏకాంతంలో భూమి ధ్రువగళాలెత్తి
ఏడ్చినరోజు
తెల్లనిపావురం ఎండలో సొమ్మసిలి
పోయింది
తల్లిలేని పిల్లల్ని నీడలోకి పిల్చేవాళ్ళు లేరు

ఇలా కొనసాగుతుంది ఈ ఎలిజీ. 'నాగరికత నగరం మధ్య నడిరోడ్డుమీద మూర్ఛపోయింది' అంటే ఇంతకన్నా విషాద చిత్రమేముంటుంది!

'స్వప్నకారికలతనిచుట్టూ పరిభ్రమిస్తున్నాయి'-'కోటి కోటి ఎడల గులాబీలు అతని పాదాలు ముద్దిడుకున్నాయి'- ఇవన్నీ బొమ్మలుగా మనకు కనిపిస్తాయి.

తిలక్‌వి నిరాకార భావచిత్రాలుకావు. నిరలంకార భావచిత్రాలూ కావు. కవితోపనిషత్‌లో చూడండి.

నీడల కొండచిలువలు కెలుకురు
పంచేళ్ళను మింగి
సంఘపు మర్రిచెట్టును చుట్టుకుని మత్తుగా
నిద్రపోయే సమయాన
మానవారణ్యంలోని పెద్దపులులు
జరీకండువాలు, బిరుదాంకితమైన
సువర్ణపతకాలు ధరించి
సిటీలో సభావేదికమీద కథాకళినృత్యం
చేస్తున్నకాలాన

అంటూ సమయవర్ణన సాగుతుంది. ఆధునిక నాగరికతావిషాదాన్ని ఇంతగొప్ప భావచిత్రాల్లో రచించి ప్రదర్శించిన మరోకవి ఎవ్వడూ లేడు. దీనిముందు శ్రీశ్రీ రచించిన 'నీడలు' వెలవెలపోతుంది. "యుగయుగాల దోపిడిలో నరనరాల రాపిడిలో పగదూరిన, పొగచూరిన కాగునాల జాడలు, జాలిజారు గోడలు, చూడు, చూడు నీడలు, నీడలు, పొగమేడలు" అంటూ శ్రీశ్రీ చిత్రకవిత రచించగా తిలక్ కవితాచిత్రాలు రచించాడని చెప్పాలి.

నిరాకారమైన కొన్ని అనుభవాలకు తిలక్ ఆకారం కల్పిస్తూ భావచిత్రాలు రచిస్తాడు. ఇందువల్లనే తిలక్‌ను అనుభూతి కవి అంటారు కానీ తిలక్ కవిత్వమంతా అనుభూతికవిత్వంమాత్రమే కాదు, అందులో స్పష్టమైన సామాజిక లేదా ప్రాపంచిక చైతన్యంకూడా కనిపిస్తుంది, అతడొక ఆలోచనాపరుడుగా కనిపిస్తాడే గానీ అనుభూతికవుల మనుమలే వారిలాగా ఉన్మాదుల్లా కనిపించడు. ఉదాహరణకు 'రాత్రివేళ' అనే ఖండికను తీసుకుందాం.

ఇంత రాత్రివేళ ఈ గానం ఎవరిదో
చీకటి కాగితం మీద
ప్లాటినం తీగలాగ మెరుస్తోంది
చెరచబడ్డ జవ్వని విడివడిన పృథునిరోజ
భారంలాగ ఈ
నిశీథం మలినమలినమైన చెదరిన తన
అందాన్ని
చీకట్లతో కప్పుకుంటోంది.'

ఇలా ఒక అనుభవాన్ని ఆకారరేఖాంకితంగా మన ముందుంచడంలో చాలా గడుసుగా నడిపిస్తాడు తన భావతూలికను తిలక్. ఇలాంటి రాత్రినే శ్రీశ్రీ కూడా వర్ణించి ఉన్నాడు. నిద్రకు వెలియై నేనొంటరినై నాగదిలోపల చీకటిలో చీకటిలోపల నాగదిలో నాగదిలో చీకటిలో అంటూ చిత్రకవితగానే సాగుతుంది శ్రీశ్రీ కలం చిత్రించిన ఆ వేళ అనే ఖండిక. శ్రీశ్రీది గానానికి పట్టంకట్టిన సింబాలిజం. తిలక్‌ది చిత్రానికి అంకితమైన ఇమేజిజం. శ్రీశ్రీరాసిన 'ఒకరాత్రి' ఖండికను చదివితే అతడ్నికూడా అనుభూతి కవి అనే అనాలనిపిస్తుంది. అయితే అందులో శ్రీశ్రీ వర్ణించింది వెన్నెలను. అతిభయంకరమైన వెన్నెల. ఆకాశపు ఎడారిలో కాళ్ళుతెగిన ఒంటరి ఒంటెలాగుంది జాబిల్లి' అంటూ భావచిత్రాన్ని ప్రదర్శించాడు శ్రీశ్రీ. తిలక్ కూడా వెన్నెల నెన్నోచోట్ల చిత్రించాడు. వెన్నెలను చూసి తన అనుభూతిని చెప్పడంలో తిలక్ సగటుమనిషి గుండెల తలుపులు తడతాడు.

చచ్చిపోయిన మా అమ్మ తిరిగొచ్చినట్లుంది
స్వర్గంలో ఎవరో సంగీతం
పాడుతున్నట్లుంది.

ఇక్కడ మనకి అనిపించేదేమిటంటే కవిత్వం అంతరాంతరజ్యోతిః స్సీమల్ని బహిర్గతం చేయాలి అని. శ్రీశ్రీ కరచ్చంద్రిక కూడా మనకిక్కడ చటుక్కున గుర్తుకు వస్తుంది. అతడు వెన్నెలను చూడగానే ఇలాంటి అనుభూతులకులోను కాదలుచుకోలేదు. 'వెన్నెల పేరెత్తితే చాలు వెర్రెత్తిపోతుంది మనస్సు' అంటూ బాధపడి, మానవలోకంయొక్క తీరుతెన్నుల్ని జాబిల్లికి చెప్పడానికుపక్రమించాడు. ఇక్కడే కాల్పనిక కవికీ అభ్యుదయకవికి తేడా తెలుస్తుంది. కవిత్వం లోకాన్ని మరమ్మత్తు చేయాలి అనుకున్నప్పుడు రూపరేఖలు మార్చక తప్పదు. అయినా కవి భావచిత్రాలనూ అనుభవ చిత్రాలనూ వదిలేయనక్కర్లేదు.

సమర్థుడైవుండి కూడా శ్రీశ్రీ చాలాచోట్ల భావచిత్రాలను విసర్జించాడు. శ్రీశ్రీ సింబాలిజం మీద శ్రద్ధ ఎక్కువ చూపించాడు. అన్ని ఇజాలనూ కొంచెం కొంచెం పరిచయంచేస్తూ మార్క్సిజం యొక్క ప్రభావాన్ని కవిత్వంద్వారా సమాజం మీద విసరాలని ప్రయత్నించినవాడు శ్రీశ్రీ. అందువల్ల శ్రీశ్రీ కవిత్వంలో కొట్టొచ్చినట్లుకనిపించేది కొత్తఆలోచన.

తిలక్ ప్రత్యేకత చెప్పుకోవలసివచ్చినపుడు మనం కొత్తఆలోచనల గురించి చెప్పుకోలేము. విప్లవం గురించి చెప్పుకోలేము. సామ్యవాదం గురించి చెప్పుకోలేము. మరి తిలక్ ఆరాధించిన సౌందర్యం గురించి చెప్పుకుంటాం. తిలక్ రచించిన భావచిత్రాల గురించి చెప్పుకుంటాం. తిలక్‌లోని ప్రజాస్వామ్య దృష్టి గురించి, విశ్వజనీన భావాల గురించి, మానవీయదృష్టి గురించి చెప్పుకుంటాం. తిలక్‌ను ఒక సంఘశ్రేయస్సుకోరే ఆర్టిస్టుగా గుర్తిస్తాం. తెలుగుభాషలో అద్భుతంగా భావచిత్రాలు నడిపించినందుకు అతడ్ని స్మరించుకుంటాం.

(తరువాయి 10వ పేజీలో)

# 4. విశ్వనాథ మధ్యాక్కరలు - సమీక్ష

—డా॥ ఎ. పద్మబాల

జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత, నవ్యాంధ్ర సాహిత్యంలో లబ్ధప్రతిష్ఠులూ, మహాకవి, ఒకనాటి ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి, రాష్ట్ర కేంద్ర సాహిత్య అకాడమీల నుండి అనేక బహుమతులు పొందిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ తడవని ప్రక్రియ లేదనవచ్చును. 'విశ్వనాథ మధ్యాక్కరలు' అనేది కూడ వీరి రచనే. శ్రీ విశ్వనాథవారు, శ్రీగిరి, శ్రీకాళహస్తి, భద్రగిరి, కులస్వామి, శేషాద్రి, ద్రాక్షారామ, నందమూరు, వరుకల్, మున్నంగి, వేములవాడ క్షేత్ర దైవతాలపై, పదిశతకాలను వ్రాశారు. ఇవన్నీ 'మధ్యాక్కరల'లో రచింపబడ్డాయి. 'విశ్వనాథ మధ్యాక్కరలు' ఒక సంపుటిగ ప్రచురింపబడ్డాయి.

నన్నయ్యకు పూర్వం యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో (885 ప్రాంతం) మధ్యాక్కరలు ఉన్నాయి. నన్నయ తన భారతంలోకూడ మధ్యాక్కరలు ప్రయోగించాడు.

మధ్యాక్కరకు, ప్రతి పాదంలోనూ, రెండింద్రగణాలు, ఒక సూర్యగణం, మరల రెండింద్ర గణాలు ఒక సూర్య గణం - మొత్తం ఆరు గణాలుంటాయి. ప్రతి పాదం నాల్గవగణం మొదటి అక్షరం యతి. నాల్గు పాదాల్లోనూ ప్రాస ఉంటుంది.

శ్రీ విశ్వనాథ ప్రత్యేకంగా మధ్యాక్కరల్లో శతక రచన చేయడం శతక వాఙ్మయానికే అలంకారప్రాయమైందని చెప్పవచ్చును. విశ్వనాథ మధ్యాక్కరలకు కేంద్రసాహిత్య అకాడమీవారు 5 వేలరూపాయల అవార్డు నిచ్చి గౌరవించారు.

విశ్వనాథ మధ్యాక్కరల్లోని పదిశతకాల్లోనూ కవి ఆత్మానుభూతి, లోక పరిశీలనం అనేవి ప్రధానాంశాలుగ ఉన్నాయి. ఈ అనుభూతిలో, వారికి గల భక్తి పారమ్యం, లోకజ్ఞత, బహుముఖ ప్రజ్ఞ, అపారమైన జీవితానుభవం, వారి వ్యక్తిత్వం వ్యక్తమౌతాయి. లోకంలోని అవినీతిని, అధర్మాలను విశ్వనాథ వారు సందర్భానుసారంగా అధిక్షేపించారు.

విశ్వనాథవారి ఆత్మానుభూతి పాయలు పాయలై పదిశతకాల్లో కవితా ప్రాగల్భ్యాన్నొంది ప్రత్యక్షమౌతూ వుంది. తెలుగుదేశంలోని శివ, కేశవ క్షేత్ర దైవతాలపై శతకాలు రాసి, తెలుగువారి అద్వైత దృష్టికి, శివకేశవ అభేద దృష్టికి ప్రతీకగా మధ్యాక్కరల రూపంలో అందించారనవచ్చును. విశ్వనాథవారికి నందమూరి స్వామి ఇష్టదైవం. కాబట్టి విశ్వేశ్వరునిపై అధికమైన భక్తి ఉండటం సహజం. ఇక శ్రీరాముడు తెలుగు వారందరి దైవం. విశ్వనాథవారు కిన్నెరసాని పాటల్లోనూ, రామాయణ కల్పవృక్షంలోనూ శ్రీరాముని పట్ల తన కున్న భక్తి పారమ్యాన్ని వ్యక్తీకరించారు. ఇటు నారాయణాంశను కీర్తించి, అటు విశ్వేశ్వరుని అభినుతించిన విశాల హృదయులు విశ్వనాథవారు. వీరిలో, తిక్కనలోవలె, నాచనసోమన, పోతనల వలె హరిహరాద్వైత తత్త్వముంటుందని చెప్పవచ్చును.

'శ్రీగిరి శతకం'లో, 'శ్రీశైల మల్లికార్జున మహాలింగ' - అనేది మకుటం. విశ్వనాథవారి అనుభూతిలో అంతులేని ఆవేదన, పశ్చాత్తాప భావనివేదనము పట్ల తర్పణమునందు వలె కనబడుచున్నది.

నేనెంత నా బ్రతుకెంత సృష్టిలో నిజము
నావంటి
మానవుల్ మూడు కాలముల బుట్టుచు
నుడియుచున్నారు
కానగా సర్వ దేశముల యందు జగం
బొక పెద్ద
దూనాతణంబు శ్రీశైలమల్లికార్జున మహా
లింగ' (శ్రీ గిరి - 7 వ).
'ఇప్పటి నాస్థితిచూడ నెడదలోఁ
గోర్కె లేమియు వెలికి

(9వ పేజీ తరువాయి)

శ్రీశ్రీ ఈయుగంలోని బీభత్సభయాన కాలను గుర్తించారు. కానీ తిలక్ వాటిని గురించి భయపడిపోయాడు, విప్లవానంతర కాంతిని తిలక్ నమ్మలేకపోయాడు. విప్లవాన్ని తిలక్ ఊహించనే లేకపోయాడు. అతని ఊహలు, స్వప్నాలు వర్గసంఘుల సమాజానికి అవతలితీరాలు మాత్రమే. అందుకే పులిచంపిన లేడి నెత్తురూ ఖడ్గమృగోదగ్రవిరావం వంటివి కావాలని శ్రీశ్రీ అంటే తిలక్

పులిచంపిన లేడినెత్తురు పులుముకోలేను
ఖడ్గమృగోదగ్రవిరావం ఆలకించలేను
శ్మశానభూమిని విలసిస్తుంది వీరు నాటిన
చెట్టు
కాని ఎవరు తుడుస్తారు తల్లీ నా కన్నీటి
బొట్టు
అని ప్రశ్నించి, నిష్క్రమించాడు.

......

గుప్పించి దూకెడు జాడలేదు మేల్కొను బల్వ గాగ
నప్పు! యూహల నందఱుండ దెలియ దమా జీవుడేమి
చొప్పగలాడో శ్రీశైల మల్లికార్జున మహాలింగ' ( శ్రీగిరి - 18 ప. )

జనుల భోగాశను గూర్చి విశ్వనాథ వారు,
'కోరి, కలేలాల మందగా దోలికొని పోవుచుండ
దారి ప్రక్కన యున్న పచ్చిగడ్డిపై దారాడు పసుల
తీరుగానున్నది జనుల భోగాశ! ...(8 ప)'
"అనే పద్యంలో చెప్పారు.

భగవంతుని కులమతరహితంగా సునిశితబుద్ధితో కొల్వవచ్చునని,

'తనివితీరగ నిన్ను రెండుచేతుల దాకగా వచ్చు
గనుల ద్రోవగ వచ్చు నిన్ను గౌగింట గ్రచ్చుకోవచ్చు
ననిశ మున్నట్లుగా వచ్చి మడిలేకయును గొల్వవచ్చు
సునిశితబుద్ధి శ్రీశైల మల్లికార్జున మహాలింగ' (1 ప.) అనే పద్యంలో విశ్వనాథ వారు వివరించారనవచ్చు.

కవి ఆత్మనివేదనానికి క్రింది పద్యాలను చూడవచ్చు.

'నిముసంబులవి తెలియందు నాబుద్ధి నీ మీద నిలచి
భ్రమియింప కుండునో యవ్వియాల స్వల్పపు సంఖ్య కలవి
తమము తక్కిన యవి యుర్వి వెలుగన్న ధైర్యము కాక
సుమన స్స్వరూప! శ్రీశైల మల్లికార్జున - మహాలింగ' (80 ప)

'అట ప్రాలి యున్నట్టు అథవ యూహించినప్పుడే నాకు
ఘటన నిత్యమ్ముగా నున్న దామాయ క్రమ్మి నేనెఱుగ
నటులైన నీ నిత్య సన్నిధాన ధైర్యము వహించెదను
స్ఫుటము సేయగదె .... ' (19 ప.)

'ఒకచోట గూర్చుండి నిన్ను మాహింతు నోయన్న నన్ను
నొక చోట గూర్చుండ నీరు కవినైన యొక దోస మొప్ప
యొకచోట గూర్చుండ నీదు సంసారమో స్వామి, పూర్వ
సుకృతంబు లేదు .... (41 ప.)

విశ్వనాథవారి అనుభూతి తత్త్వ ప్రధానమైనది. సహస్రారంలోని పరమేశ్వరుని కొరకు పైకి ప్రోవి చిమ్మినట్లు నాడుల్లోని రక్తం ఎదురు ప్రవహిస్తూ వుందని, జన్మదుఃఖపు తోవవచ్చి సుడిలాగ తిరుగుతూ ఉందనీ విశ్వనాథ వారు తన గుండెలోని బాధను వ్యక్తపరిచారు. కామవృక్షం నిత్యనూతనమై చిగురులు తొడుగుతూ ఉందనీ, అది మాని మైలె మాని రెట్టింపౌతూ వుందనీ, గుండెలో దిగులొకటి కొండవలె కూర్చున్నదనీ విన్నవించి కవి తనలో పెనవేసుకొన్న దురూహాలను ఛేదింపుమని మల్లికార్జునుణ్ణి ప్రార్థించాడు.

భగవంతుని మోతువలను గూర్చి కవి క్రింది పద్యంలో చెప్పారు.

'అలసి ధీవరుడైన వాడు మరి దేనినైన గ్రహించు
తలపుతో వలవేయు నీవు వేసిన దయలేని మాయ
వల దేనికని వేసినట్లు? జీవులు వణకి పోవుటకు
సొలసి పోవుటకు' ... (81 ప.)

తన భక్తి నాటకం కాదని క్రింది పద్యంలో కవి స్వామికి విన్నవించాడు.

'ఇది కాదటంచు నా బ్రతుకు నేను యథేచ్ఛంబు గాగ
బ్రతుకుచు మరి మధ్య మధ్య నీవు కన్పడ దంచు దెనుగు
పదములు వ్రాయుచు నాటకంబుగా భావింతు నేను
సుదతీ కృతార్థ! ... (88 ప.)'

లోకం తీరును గూర్చి విశ్వనాథ వారు చెప్పిన తీరు ప్రశంసనీయం.

'కలిసి వచ్చినవాడు జగము పోరుమ కలవమంచాడు
కలిసిరాని యతండు లోకమిది దైవఘటన యంచాడు
తెలివి వేయి విధాల తేల్చి వేయుట తెలిక నిన్ను
సులభమార్గమ్ము ... ' (61 ప.)

విశ్వనాథ వారు తనకవితా కన్యను పరమేశ్వరార్చనకు వినియోగించారు. దీన్ని క్రింది పద్యంలో చూడవచ్చు.

'నా బిడ్డ యీ కైత, పాపమిది కండ నగజాత స్వామి!
జాబాలి మైత్రావరుణి మొదల్ ఋషుల్ సంబంధమాడ
రాలేరు నా మాట మీద దీనిని గ్రహియింపు మిదియె
సోపాన మూడ ... (77 ప.)

విశ్వనాథ సత్యనారాయణగారు తన మధ్యాక్కరల్లో వినమిత శిరస్కులై ఆత్మానుభూతిని వ్యక్తీకరించారు.

ఈ వ్యాసంలో శ్రీగిరి శతకాన్ని మాత్రమే సంక్షిప్తంగా సమీక్షించడమైంది. పదిశతకాలను సమీక్షించడం ఈ వ్యాసంలో వీలు పడదనే భావంతో యిలా చేయడం జరిగింది. మిగిలిన తొమ్మిది శతకాలలోని మకుటాలను మాత్రమే యిందు వివరిస్తున్నాను.

(తరువాయి 12వ పేజీలో)

# 5. పూసపాటివారి నాశ్రయించిన తొలి కవి వేములవాడ భీమకవి

—శ్రీ కె. వెంకట్రామయ్య, ఎం.ఏ., ఎం.ఫిల్.,

పూసపాటి (విజయనగర సంస్థాన) రాజుల నాశ్రయించిన తొలికవి వేములవాడ భీమకవి. ఆంధ్ర సాహిత్యచరిత్రలో శాపానుగ్రహ సమర్థత గలిగిన మహాకవిగ మన్నెన్న బడువాఁడు భీమకవి.

చ॥ 'ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ
దాక్షారామ భీమేశ నం
దనుఁడన్ దివ్య విషామృత ప్రకట
నానాకావ్యధుర్యుండ భీ
మన నా పేరు వినంగ జెప్పితి
దెలుంగాధీశ! కస్తూరికా
ఘనసారాది సుగంధవస్తువుల వేగం
దెచ్చి లాలింపురా'[1]

అని ధిషణాహంకారమున చాటుకొనిన మేటి సుకవి వేములవాడ భీమకవి. పూసపాటి రాజులలో మైలమభీమనకితఁ డాశ్రితుడు. మైలమ భీమనమీఁది చాటుపద్యకోటి వేములవాడ భీమకవి సృష్టిగ పరంపరాగత ప్రసిద్ధి.

(పూసపాటి) దేవవర్మకు మైలమదేవి యందు జన్మించిన వాడు మైలమభీమన. ఈ మైలమభీమన నిడుదవోలు దుర్గాధిపతి. ఇతని కాలము క్రీ.శ. 1300-1400 నడిమి ప్రాంతము[2]. తూర్పుగోదావరి జిల్లాలోని దక్షారామము దరినిగల 'వేములవాడ' భీమకవి జన్మస్థలము. సమీప ప్రాంత పాలకు డగు 'మైలమ భీమన'ను భీమకవి ఆశ్రయించుట సహజము. అతని పరాక్రమక్రమమును ప్రసారించు గాథలను చాటుపద్యములలో గావించి యుండును.

చం॥ "గరళపు ముద్ద లోహమవగాఢ
మహాశని కోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కార్మి యురగాధిపు
కోఱలు పట్టుకార్లుది
క్కరటి శిరంబు దాయ లయకా
లుడు కమ్మరి వైరివీరసం
హరణ గుణాభిరాము డగు
మైలమభీమన ఖడ్గసృష్టికిన్"

ఈ పద్య 'మప్పకవీయము' తృతీయాశ్వాసమున (77 వ పద్యము) 'ముకర్ణవిరామము'ల నుదాహరణముగ 'భీమన చాటుధార'గ నీయబడినది. అణిముత్యముబోలిన యీచాటువులో భీమకవి కవితాప్రతిభ ప్రతిపదమున పరిఢవిల్లినది. అరివీర నిర్మథన విద్యాపారగుఁడగు మైలమ భీమన 'ఖడ్గసృష్టికి'[3] గరళపు ముద్దలోహము, భయంకరమైన పిడుగులపింజం, సమ్మెటలు, ముక్కంటికంటి మంట కొలిమి, సర్పరాజు కోఱలు పట్టుకార్లు, దిగ్గజకుంభ స్థలము డాగలి. లయకాలుఁడు కమ్మరియట. కేవలము కవితాపరముగనే కాక చారిత్రకముగను యీ చాటుపద్యము మహార్ఘ్యమైనది.

బహువిధ సంశయాస్పదమగు మైలమ భీమన, వేములవాడ భీమకవుల కాలనిర్ణయమునకు కరదీపిక యీ చాటువు. ఆచార్య కోర్లపాటి శ్రీరామమూర్తిగారి నిరూపణమిది.[4] ఈ (భీమన చాటువు)

1. తెలుగులో తిట్టుకవిత్వము - రావూరి దొరస్వామి శర్మ - పు. 6.
2. భారతి. సం. 59. సం. 6. జూన్, 1982. పు. 10.
3. అభ్యుదయ కవితోద్యమ వైతాళికుడు శ్రీశ్రీ తన గ్రంథమునకు 'ఖడ్గసృష్టి' యని నామకరణము చేయుటకు ఈచాటువే ప్రేరణము. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. ప్ర. ము. ఫిబ్రి. 1966.
4. కవిజనాశ్రయము - కర్తృకాలములు; వాఙ్మయభారతి - సం. 59. సంచి.6 జూన్ 1982. పు. 10.

(11వ పేజీ తరువాయి)

శ్రీకాళహస్తి శతకం -
'శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ'

భద్రగిరి శతకం -
'భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ'.

కుల స్వామి శతకం -
'నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కుల స్వామి'.

శేషాద్రి శతకం -
'వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ'.

ద్రాక్షారామ శతకం -
'భీమేశలింగ! ద్రాక్షారామ సంగ'.

నందమూరు శతకం -
'నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల'.

నెకరుకల్లు శతకం -
'నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జ హేళి'.

మున్నంగి శతకం -
'మున్నంగి వేణుగోపాల'.

వేములవాడ శతకం -
'వేములవాడ రాజ రాజేశ్వరా! స్వామి'.

విశ్వనాథ మధ్యాక్కరలు శతక సాహిత్యలోకంలో అణిముత్యాలనవచ్చు. ఇటువంటి రచన చేసిన కవిసామ్రాట్ విశ్వనాథ చిరస్మరణీయుడు.

0—0

నందు "పట్టుకార్లు" అను పదము ప్రయుక్తమైనది. ఇది డిక్ష్నరీ, కన్నడమునందు పటకారు, తెలుగులో పటకారు) పటుకారు అను పదములు కావి, ఇతర ద్రావిడ భాషలందు ఇట్టి పదములేనట్లు ద్రావిడ పదవ్యుత్పత్తి కోశమునందు కలదు. (అనుబంధము - యస్. 603) ... కారుఖానా అను పదమునకు యంత్రాంగారమని అర్థము. పద్యములోని 'పట్టుకార్లు' కమ్మరి కారుఖానాలోనిదే. 'పట్ కారు' అను పారసీ పదమునుండి పటకారు అను పదము నిష్పన్నము కావచ్చును. అనగా పటకారు అన్యదేశ్యము. అది ఉచ్చారణమున పటుకారు అగును. కతుల తెనుగు చేతను పట్టుకారు అగును. తెలుగు భాషలో అన్యదేశ్యములు పదునాలవ శతాబ్ది ఉత్తరార్థమునందు ప్రవేశించినవి. అది పటుకారు, అనుటకు కొంతకాలము, పట్టుకారు అగుటకు మఱికొంత కాలముపట్టును. అందువలన 'పట్టుకార్లు' అను పదము ప్రయుక్తమై పద్యము రచనాకాలము పదునాల్గవ శతాబ్దికావలయును. కనుక ఖడ్గసృష్టికి పూర్వము లోని 'పట్టుకార్లు' అయిన మైలమభీమనకాలము,'పట్టుకార్లు,' అను పదము ప్రయోగించిన వేములవాడ భీమన కాలము పదునాల్గవ శతాబ్ది.'

ఈ సందర్భమున మైలమ భీమకవి ఖడ్గధారా'తో పాటు అవక్రపరాక్రమమును పరికీర్తించు పద్యములు మఱి నాలుగు కలవు.

అవి 5 -

చం॥ 'విదితగుణ ప్రతాపగుణ విశ్రుత ।
మైలమ భీమభూప! నీ
పదిల ప్రఖడ్గధార దెగ పాతిన
వీరుడు గోపురంబుపై
విదిత సువర్ణరత్నమయ వేదిక మీదను
నిల్చి కాంచు నా
పదిపదు అగ్నిహోత్రులను పన్నిరు
సూర్యుల నాఱుచంద్రులన్'

మ॥ 'తెరలం బారి సభంబు దాకిన
బహోద్ధిం జొచ్చినన్ శైలగ
హ్వరములన్ దూఱిన చిక్కి భీము దు
సృప వ్రాతంబు కానిచ్చునే
గరుడుండై చని పట్టుమింటికుద
సుగ్రగ్రాహమై పాచ్చి సా
గరమధ్యంబున క్రింగు బట్టుకొను
సింగంబై గుహాంతంబునన్'

చం॥ అహితుల దాకి పోరునెడ నంబధి
కట్టిన నాటి రాము గో
గ్రహణము నాటి పార్థు గద గొంపు
చేసిననాటి భీము, నా
గ్రహ మెసగంగ బురత్రయము
గాల్చిన నాటి లలాటలోచనున్
మహిమ మపమింపగా దగును మైలమ
భీమన విక్రమ క్రమమున్

ఉ॥ ఆలములో నరాతులకు మన్మథని
మార్గాన వచ్చునే మహా
కాళికి శూలికిన్ ప్రళయకాలపు గాలికి
రాఘవేంద్రు బీ
ణాళికి బడబాయత నఖాళికి
మత్తగజేంద్ర వైరి దం
ష్ట్రాళికి దావపావక శిఖాళికి మైలమ
భీము నాలికిన్'

కావుననే మైలమ భీమన 'ఖండవ భీముడు'గ ప్రసిద్ధికెక్కినాడు. పై నుదాహరించిన 'గరళ ప్రబుద్ధ' పద్యమును నిదియును నాకే సందర్భమున చెప్పినవై యుండును. ఇందలి రెండవ పద్యమగు 'తెరలంబారి' అనుదానిలోని 'సింగంబై ... గుహాంతంబునన్' అనెడి మాటలు తిక్కనగారి ప్రసిద్ధపద్యమైన 'సింగంబాకటితో గుహాంతరంబునన్' (విరాట. అశ్వా. 4 ప, 95) అను పద్యపంక్తిని స్ఫురింపజేయుచున్నది. 'పచియింతు వేములవాడ భీముని భంగి, నుద్దండ లీల నొక్కొక్కమాటు' అని శ్రీనాథుడు భీమకవి 'ఉద్దండలీల'ను తన పూర్వకవిస్తుతిలో ప్రస్తుతించినాడు. ఆ 'యుద్దండ లీల' పై పద్యములందు ప్రస్ఫుటము. కనుక నీ పద్యములను భీమకవి కృతములని భావింపవచ్చును.

సకల సద్గుణ సంపన్నుడు, యాచకఖని, ఖండవభీముడునైన మైలమ భీముని మరణానంతరము చెప్పిన మఱి కొన్ని పద్యములును లభించుచున్నవి. వానిలో-

ఉ॥ "సత్వము బ్రహ్మ జేరె, నిజనిర్మల
తేజము సూర్యు జేరె, నా
కారము కాము జేరె, నధికంబగు లక్ష్మి
యనంతు జేరగం
భీరత వార్ధి జేరె గలవెంపు కులాద్రుల
జేరె గీర్తి దా
నూరట లేక త్రిమ్మరుచున్నది మైలమ
భీము డీల్గినన్"

అనునదొకటి మైలమ భీముడు మరణించగ నాతనిలోని సత్త్వ బ్రహ్మలో లీనమైనదట. తేజము సూర్యుని చేరుకొనినదట. స్వరూపము మన్మథునిలో కలిసిపోయినదట. ఇతని అనంతసంపద విష్ణువును, చేరినదట, అతని గాంభీర్యము సముద్రునాశ్రయించె; ఔన్నత్యము కులగిరులను ఆశ్రయించినదట. ఇక అతని కీర్తికి 'ఊరటలేక' ఎవరిని ఆశ్రయించవలెనో తెలియక లోకమంతయు తిరుగుచున్నదట. మైలమ భీముని రూపసంపద, తేజః పరాక్రమములు, తనూవిలాసము, అనంతసంపద అగాధ గాంభీర్యము మహోన్నతత్వము, యశోలక్ష్మి అపురూపములని కవి హృదయము.

---

5. చాటుపద్యమణిమంజరి - ద్వి. భా. పు. 58-61.

గురజాడ అప్పారావుగారి 'పూర్ణమ్మ కథ' లోని 'ముత్యాలసర' మొకటి ఈ పద్యభావమును బోలి కన్పట్టుచున్నది. పూర్ణమ్మ పూజకు పోయి తిరిగిరాలేదు. ఆత్మాహుతి చేసికొనినది.

'కన్నుల కాంతులు కలువల చేరెను,
మేలిమి చేరెను మేనిపసల్
హంసల చేరెను నడకల వెడగల్
మర్గను చేరెను పూర్ణమ్మ'

అని గురజాడ వర్ణనము.

ఇవి కాక మఱిరెండు పద్యములు 'భీమకవి'ని అనిపించునని కలవు. అవి -

ఉ॥ 'వీరగుణ ప్రతాపగుణవిక్రుత!
మైలమ భీమ! నీ యశం
బారభమాన తారకరహారవిలాసము నీ
నీ నికేతనం
బారభమాన తారకరహారవిలాసము నీ
భుజార్గళం
బారభమాన తారకరహార విలాసము
చిత్రమిద్ధరన్

ఉ॥ ఖండన భీమ! నీ రొదుటఁ బాటక
నిల్చిన శాత్రవుల్ బ్రహ
స్మండల పుండరీక పురనాక నివాసులు
నోర్చినన్ బ్రహ
స్మండల పుండరీక పురనాక నివా
సులు చచ్చినన్ బ్రహ
స్మండల పుండరీక పురనాక నివాసులు
చిత్ర మిద్దరన్'

దీనిలో చిత్రకవిత్వము కలదు. వేములవాడ భీమకవి 'రాఘవ పాండవీయ, మను ద్వ్యర్థి కావ్యమును రచించెనని పింగళి సూరన చెప్పిన మాట ప్రసిద్ధము

ఉ॥ 'భీమన తొల్లి చెప్పినవి పెద్దల
మాటయకాని దాని యం
దేమియు నెంచు గాన బడు చెవ్వ
రెఱుంగరు ... '

'రాఘవపాండవీయము-అవ. ప.॥'

మఱి పూసపాటి రాచిరాజు రచిత 'సీసమాలిక'లో నిట్లు కలదు.

సీ. పా. "మామక వంశ భీమ నృపాల
సచివుండు
దండ నాథాగ్రణి దానరాజు
వేములవాడ శ్రీ భీమ నిచే రామ
గోపాల చరితంబు గొనిన మేటి ...

ఇందలి 'రామగోపాల చరితము' సూరన పేర్కొనిన ద్వ్యర్థికావ్యమై యుండనోపును. ఈ కావ్యము నంకితము నందిన దానరాజు మైలమభీమన 'దండ నాథుఁడగు' వత్సవాయి తిరుమలరాజు[6]. దీనినిబట్టి శ్లేషకవిత్వమున భీమన లబ్ద ప్రతిష్ఠుడని స్పష్టము. అట్టి భీమన చిత్ర కవితా విలసితములైన పై రెండు(చాటు) పద్యములను కూడ చెప్పి యుండునని భావించుట సముచితము.

ఇట్లు వేములవాడ భీమకవి - తొలి పూసపాటి రాజులలో నొకఁడును; చరిత్ర ప్రసిద్ధుఁడును నైన మైలమ భీమన నాశ్రయించి అతని కీర్తించి సమ్మానము లందిన తొలి కవిరాజు. విశాఖపట్నం డిస్ట్రిక్ట మాన్యువల్' (1865) భీమకవి పూసపాటి వారి ఆశ్రితుడని పేర్కొనిన విషయము సత్య సమ్మతము[7].

6. 'రాచిరాజు సీసమాలిక', వ్యాసము. భారతి. సెప్టెం. 1982.

7. విశాఖపట్నం జిల్లా వృత్తాంత సంగ్రహము - అను. వీరపురెడ్డి వేంకట కోదండరామ పంతులు (1880) - పు. 181

......

# 6. వేమన కబీరుల భావసామ్యాలు

—శ్రీ ఎస్.వి. రాఘవేంద్రరావు. ఎం.ఏ.,ఎం.ఫిల్.,బి.యిడి.,

భారతదేశం కర్మభూమి. ఇది అనాదిగా అనేకమంది యోగులకు, మహాపురుషులకు జన్మభూమి. కవులకు కాణాచి. తమ సర్వస్వం లోకకళ్యాణం కోసం త్యాగంచేసే ఆ యోగపురుషులు దైవాంశ సంభూతులు. 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' అని తాను 'గీత'లో చెప్పినట్లు ఆయా కాలాల్లో, ఆయారూపాల్లో అవతరించి పాపపంకిలమైన మానవజాతిని తన వాగమృతధారల్తో పునీతం చేస్తూంటాడు ఆ పరమాత్ముడు. కారణజన్ములైన అలాంటి మహాత్ములు మన భారతదేశంలో అవతరించినంత అధికసంఖ్యలో మరే ఇతరదేశంలోనూ అవతరించలేదంటే అతిశయోక్తి కాదు. సంకుచితమైన కులమతతత్త్వాల్ని, మూఢాచారాల్ని నిర్మూలించి సంఘాన్ని సంస్కరించి భగవంతుణ్ణిచేరే మార్గాన్ని ఉపదేశించడానికి వారిలో కొందరు తమ కవిత్వాన్ని సాధనంగా ఉపయోగించుకున్నారు.

విశ్వశ్రేయస్సుకోసం, ధర్మసంస్థాపనకోసం తమసాహిత్యాన్ని వినియోగించిన ప్రజాకవుల్లో వేమన కబీరులకు విశిష్టస్థానం ఉంది. భూతదయ, భగవద్భక్తి ఈయోగి పుంగవుల ఉపదేశసారం. దక్షిణభారతదేశం తెలుగుసాహిత్యసమాజాల్లో వేమన, ఉత్తరభారతదేశం హిందీ సాహిత్యసమాజాల్లో కబీరు

నూతన చైతన్యస్ఫూర్తిని కలిగించినమహా కవులుగా కీర్తినార్జించారు.

'లోకవృత్తస్యానుకరణం కవిత్వమ్' లోకవృత్తాన్ని అనుకరించడమే కవిత్వం అనబడుతుంది. కాబట్టి కవి తాను నివసించే సమాజపరిధుల్ని దాటి సాధారణంగా పైకిపోడు. కవి తన సాహిత్యంలో సమకాలీన సమాజం యొక్క స్థితిగతుల్ని, ఆచారవ్యవహారాల్ని వర్ణిస్తూ ఉంటాడు. అందుచేతే సాహిత్యం సమకాలిక సామాజిక జీవనవిధానానికి దర్పణం అనబడింది. అప్పుడప్పుడు కవి, రవి గాంచని విషయాల్ని తన నవనవోన్మేష ప్రజ్ఞాపాటవాలతో గాంచి సాహిత్య సృష్టిగావించినా, అలౌకిక దృష్టికలిగి ఉన్నా ఏదో ఒక సందర్భంలో ఇహలోకానికి రాకపోడు. అలా కాక, నిత్యం తాను గమనిస్తూ ఉన్న సమాజంలోని కుళ్ళును, కుటిలాచారాల్ని, మూఢవిశ్వాసాల్ని ఎత్తిచూపి, వాటిని కూకటివేళ్ళతో రూపుమాపాలి అనే సంస్కార భావంతో సాహిత్యసృష్టి కావిస్తే, ఆ సాహిత్యం నూటికి నూరుపాళ్ళూ సమకాలీన సమాజానికి ప్రతిబింబం అవుతుంది, వివిధకాలాల్లో, వివిధదేశాల్లో ఉద్భవించిన అట్టి కవిపుంగవులు తమ తమ సాహిత్య సౌరభాలతో తమ తమ భాషా కుసుమాల్ని పరిమళ భరితం కావించారు.

అలాంటి సాంఘిక విషయిక భావాలతో కవితాసృష్టి కావించిన వారిలో దక్షిణాదిని వేమన, ఉత్తరాదిని కబీరు అద్వితీయులు. వేమన మన తెలుగుకవి. కబీరు హిందీభాషాకవి. వేమన కబీరుల భావల్లో భావాల్లో, స్వభావాల్లో, అభిప్రాయాల్లో కొంతతేడా కనిపించినా, వారికవితాశయాల్లో భేదం కనిపించదు. కొన్నివిషయాల్లో వీరి ఇరువురి మధ్యా సామ్యం కూడా కనబడుతుంది. 'సంవాదినోమేధావినాబుద్ధయః' అని కదా సూక్తి.

Prof. Vinaya Kumar Sarkar తన "Positive Background of Hindu Sociology" అనే గ్రంథంలో వేమన గురించి ఇలా అన్నారు.

"His (Vemana's) place in Hindu positivism is of the same rank as that of Kabir, Chaitanya and others, if not even higher."

వేమన కబీరులు ఇద్దరూ దేవుడొక్కడే అనీ, అతడు సర్వవ్యాపకుడనీ ముక్తకంఠంతో చాటారు.

'పసుల వన్నె వేఱు పాలేకవర్ణమౌ -
పుష్పజాతి వేఱు పూజ యొకటి
దర్శనంబులు వేఱు దైవం బదొక్కటి -
విశ్వదాభిరామ వినురవేమ!'

పశువులు ఎన్నిరంగుల్లో ఉన్నా అవి ఇచ్చే పాలు తెలుపు రంగులోనే ఉంటాయి. ఎన్ని పుష్ప జాతులున్నా భగవంతునికి చేసే పూజ ఒక్కటే. భగవంతుణ్ణి దర్శించే మార్గాలు ఎన్ని ఉన్నా భగవంతుడు ఒక్కడే.

'కనంగ సొమ్ము లెన్నో కనకం బదొక్కటి' అని మరోచోట చెప్పి, 'తెలియ విశ్వమెల్ల దేవాధి దేవుదే' అని దేవుని సర్వవ్యాపకత్వాన్ని గూర్చి చెప్పాడు వేమన్న.

'సాహెబ్ మేరా ఏక్ హై, దూజా
కహా న జాయ్।
దూజా సాహెబ్ జో కహూం, సాహెబ్
ఖరా రిసాయ్॥'

నా భగవంతుడు ఒక్కడే. ఇంకొకడు ఉన్నాడని నేను అనను. మరొకడు ఉన్నాడని నేనంటే నా స్వామికి మిక్కిలి కోపం వస్తుంది.

దేవుడు ఒక్కడే అని ధ్వని గర్భితంగా చెప్పి, 'ఘట్ ఘట్ వ్యాపక్ హై రహా సోయీ' అని ప్రతి శరీరంలోనూ భగవంతుడు ఉన్నాడు అని ఈశ్వరుని సర్వ వ్యాపకత్వాన్ని గూర్చి చెప్పాడు కబీరు.

ఇద్దరూ అద్వైత వాదులే. జీవాత్మలోనే పరమాత్మ ఉన్నాడు అన్నారు.

'కట్టె యందు నిప్పు కానని చందమౌ -
తనువునందు నాత్మ తగిలియుండు
మిణుగు తెలిసిపిదప మార్గాన వలెనయా -
విశ్వదాభిరామ వినురవేమ!'

కట్టెలో దాగిఉన్న నిప్పుపైకి కనబడనట్లుగా శరీరంలో ఆత్మ ఉంటుంది. ఆ జీవాత్మే పరమాత్మ స్వరూపం. ఈ రహస్యాన్ని తెలుసుకోవాలి. అని వేమన్న ప్రబోధం.

'జ్యోం తిలమాహీం తేల్ హై
జ్యోంచక్ మక్ మేం ఆగ్।
తేరా సాయీ తుఝ్ మేం జాగ్ సకై తో
జాగ్॥'

నువ్వుల్లో నూనె దాగి ఉన్నట్లే, చెకుముకి రాతిలో నిప్పుదాగి ఉన్నట్లుగానే నీ భగవంతుడు నీలోనే ఉన్నాడు. తెలుసుకో గలిగితే తెలుసుకో అని కబీరు ఉద్బోధ.

జీవులు లోపలున్న దేవుణ్ణి కానలేక మాయాజాలంలోపడి ఆ దేవుడికోసం ఎక్కడెక్కడో వెదుకుతూ ఉంటారు. ఈ విషయాన్ని వారిద్దరూ ఎంత చక్కగా చెప్పారో, ఆ భావనకు ఎంత దగ్గర సంబంధం ఉందో చూడండి.

'మనసులోని ముక్తి మరియొక చోటను -
వెదుకబోవువాడు వెఱ్ఱివాడు
గొఱ్ఱె చంక బెట్టి గొల్ల వెదకు రీతి -
విశ్వదాభిరామ వినురవేమ!'

గొర్రెను చంకలో నే పెట్టుకొని గొల్ల వాడు ఆ గొర్రె కోసం అడవి అంతా వెతికినట్లు, మనసులో ఉన్న పరమాత్మను పుణ్యక్షేత్రాల్లో ఉన్న ఆలయాల్లో వెదకడానికి తీర్థయాత్రలు చేసేవాడు వెర్రివాడు.

'తేరాసాయీ తుఝ్ మేఁ జ్యోం
పుహుపన్ మే బాస్।
కస్తూరీ కా మిరగ్ జ్యోం ఫిర్ ఫిర్
ఢూంఢే ఘాస్॥'

పువ్వుల్లో పరిమళం దాగి ఉన్నట్టు నీ భగవంతుడు నీలోనే ఉన్నాడు. ఆ పరమాత్మను గుర్తించలేక, తన నాభిలోని కస్తూరి కోసం అడవి అంతా తిరుగుతూ గడ్డిలో వెదికే కస్తూరి మృగంలాగ ఎందుకు భ్రమ చెందుతావు? అని కబీరు అంటున్నాడు.

'చంకలో గొర్రె పెట్టుకుని అడవి అంతా వెతికే గొల్లవాడు' 'నాభిలో కస్తూరి పెట్టుకుని అడవి అంతా తిరిగే కస్తూరి మృగం_' ఈ రెండు ఉపమానాలు ఒకదానితో ఒకటి పోటీ పడుతూ ఉన్నాయి.

వేమన కబీరులు విగ్రహారాధనను ఖండించిన తీరు చూడండి.

'శివుఁడు గలఁడటంచు శిలలకు
మ్రొక్కెడి - వెర్రి జీవులార వెతల విడుడి
జీవులందెఁ గాక శిలల నేమున్నది? -
విశ్వదాభిరామ వినుర వేమ!'

దేవుడు దేవుడని రాళ్ళకు మొక్కే- వెర్రి జీవులారా! ఎందుకా పాట్లు? జీవుడే దేవుడైనప్పుడు రాయిలో ఏముంది?

'శిలలఁజూచి నరుడు శివునిగా భావించు
శిలలు శిలలుగాని శివుడుగాడు'

నరుడు బండరాళ్ళను చూచి భగవంతుడనుకుంటున్నాడు.

అవి రాళ్ళే కాని దేవుళ్ళు కారు. అంతే గాక 'తనదులోని శివుని తా నేల తెలియఁడో!' అని పరితపిస్తున్నాడు వేమన్న.

'పాహన్ పూజై హరి మిలై తో
మైఁ పూజూఁ పహార్।
తాతే యే చాకీ భలీ పీస్ ఖాయ్
సంసార్॥'

'రాతిని పూజించినంత మాత్రాన దేవుడు దర్శనం ఇస్తే, రాతి నేం కర్మ? నేను పర్వతాన్నే పూజిస్తాను. మీరు పూజించే ఆ రాతి కంటే పిండివిసురుకోటానికి పనికివచ్చే తిరగలి మేలు.

వేమన్న మాట వీపుమీద తట్టినట్టుంటే, కబీరువాణి చబుకుతో కొట్టినట్టుంది.

చిత్తశుద్ధి ఉండాలిగాని ఎన్ని తీర్థయాత్రలు సేవించినా ప్రయోజనం లేదు అంటున్నారు వేమన్న కబీరులు.

'తీర్థయాత్రలకును దిరుగుచు జనులెల్ల
మునిసి తీర్థములను మునుగ నేల?
దోసకార్లకెట్లు దొరకురా యా కాశి
విశ్వదాభిరామ వినుర వేమ!'

పుట్టెడు పాపాలుచేసి తీర్థయాత్రలు చేసి నదీనదాల్లో మునిగినంత మాత్రాన మోక్షం వస్తుందా? 'కపట కల్మషములు కడుపులోనుండగా' ముక్తి గగన కుసుమం.

'కబీర్ గయా జో ద్వారికా, తీరథ్
సకల్ భారమతి ఫిర్రై,
గాంఠిన ఖోలీ కపట్ కీ తీరథ్
గయా తో క్యాహువా॥'

మనసులో కపట కల్మషాలు పెట్టుకుని, భ్రమతో గయ, ద్వారక మొదలైన తీర్థక్షేత్రాలు తిరిగితే ఏమవుతుంది? చిత్తశుద్ధి ముఖ్యం అని కబీరు భావన.

తీర్థయాత్రలు వ్యర్థప్రయాసలు తప్ప వాటివల్ల లేశమైనా ప్రయోజనం లేదు. 'పరత పోవు లంజ పతివ్రత కాదురా!' అంటాడు, పరత అనగా శ్రీశైలం అని వేమన్న అభిప్రాయం.

'తిరుమలకును బోవ తురక దాసరి గాడు
కాశిపోవ పంది గజముకాదు
కుక్క సింగమగును గోదావరికి బోవ
విశ్వ ...'

దేహంలో ఉన్న దేవుణ్ణి తెలియక తీర్థాలు తిరిగేవాళ్ళు 'గంధము మోయు గాడిద'లాంటి వారని వేమన్న భావన.

కాశీకిపోయి గంగలో మునిగినంత మాత్రాన పాపాలు పోతాయా? 'ఏళ్ళయందు కోడి తెలవుగా మునుగదా?' అని తీర్థయాత్ర వృథాప్రయాస, 'కాశీతీట' అంటున్నాడు.

తీర్థక్షేత్రాల్లో సమర్పించే 'తలనీలాలు' అనేది మూఢాచారం అని పరిహాస పూర్వకంగా ఎంతచక్కగా విమర్శిస్తున్నాడో చూడండి, వేమన సునిశిత, సజీవ హాస్యానికి ఈ పద్యం మచ్చుతునక.

'సకల తీర్థములను సకల యజ్ఞంబుల
తలలు గొరుగకున్న ఫలము లేదు
మంత్ర జలము కన్న మంగలి జలమెచ్చు
విశ్వదాభిరామ వినుర వేమ!'

శిరోముండనం వల్ల ప్రయోజనం లేదన్న కబీరు భావన చూడండి.

'మూడ మూడాయే హరి మిలే సబ్
కోయీ లేయి మూడాయ్!
బార్ బార్ కే మూడతే భేడి
న వైకుంఠ్ జాయ్॥'

తలలు గొరిగించుకున్నంత మాత్రాన దేవుడు లభిస్తే మనం అందరం అలాగే చేయొచ్చు. అప్పుడు లోకంలో ముక్తిపొందటం తేలిక. అప్పుడు మనకంటే ముందు గొర్రెలు వైకుంఠానికి పోతాయి. ఎందుకంటే అవి అస్తమానం శరీరం నిండా

ఉన్న బొమ్మను గౌరవించుకుంటూ ఉంటాయి.

వేమన కబీరు లిద్దరూ సత్యంయొక్క గొప్పతనాన్ని తెల్పి, సత్యం పరమాత్మ స్వరూపం అన్నారు.

'సత్యమునగ వేఱె జగమున గనలేదు
నిత్యమగుచు నాత్మ నెగడియుండు
నిత్యవస్తువెఱుగ నీవె బ్రహ్మము సుమ్ము
విశ్వదాభిరామ వినురవేమ!'

సత్యం అంటే ఎక్కడో నిత్యమైన ఆత్మలోనే ఉంది, ఆ నిత్యమైనసత్యాన్ని తెలుసుకోగలిగితే నీవే పరబ్రహ్మవౌతావు.

'సత్య మమరియుండ జ్ఞానమమరి యుండు
జ్ఞాన మమరియుండ సత్యముండు
జ్ఞాన సత్యములవి సమమైన ద్విజుడగు
విశ్వదాభిరామ వినురవేమ!'

సత్యవంతుడే జ్ఞానవంతుడు. జ్ఞానవంతుడే సత్యవంతుడు. జ్ఞాన సత్యాలు సమంగా ఉంటేనే ద్విజుడు అనిపించుకుంటాడు.

అలాంటి ద్విజులు, బ్రహ్మస్వరూపులు అయిన 'సత్యవంతులయెడ సరసమాడగ రాదు' అని వేమన్న ఉద్బోధ.

కబీరుయొక్క ఈక్రింది భావన వేమన భావంతో జత అవుతుంది గమనించండి -

'సాంచ్ బరాబర్ తప్ నహీం
ఝూఠ్ బరాబర్ పాప్
జాకే హిరదే సాంచ్ హై తా
హిరదే గురు ఆప్ ॥'

సత్యంపాటి తపస్సు లేదు. అసత్యంతో సమానమైన పాపం లేదు. ఎవరిహృదయంలో సత్యం నిత్యమై ఉంటుందో అతని హృదయంలో గురువు (బ్రహ్మ) నివసిస్తాడు అని కబీరు ఉవాచ.

'సత్యాన్నాస్తి పరోధర్మః' అనే సత్యాన్ని ఇద్దరూ ఎంతో చక్కగా చెప్పారు.

సంసార విషవృక్షానికున్న అమృత ఫలాల్లో సత్సంగతి ఒకటి[1] సాధ్యమైనంత త్వరలో సత్సాంగత్యం చేసుకోవడం మంచిది అంటున్నాడు కబీరు.

'కబీర్ సంగతి సాధ్ కీ వేగి కరీజై జాయి।
దురమతి దూరి గంవాయిసీ దేసీ సుమతి బతాయి॥'

సజ్జనుల సాంగత్యాన్ని శీఘ్రాతి శీఘ్రంగా సంపాదించుకోవాలి. ఎందుకంటే వారి సాంగత్యం వల్ల విషతుల్యమైన దుర్బుద్ధులు నశిస్తాయి. అమృతతుల్యమైన సద్బుద్ధులు అంకురిస్తాయి. 'సాధు సంగంబు సకలార్థ సాధకంబు.'

వేమన 'సాధుజనుల పూజ సాయుజ్య పదవిరా!' అన్నాడు. సాధు సాంగత్యం పరమ పదానికి ప్రథమ సోపానం. ఈ సోపానాన్ని ముక్తపదగ్రస్తంలో ముక్తసరిగా చెప్పాడు.

'సాధు సాంగత్య మమరిన శాంతమమరు
శాంత మమరిన చిత్తంబు శక్య పడును
శక్య పడిన మనంబె యొసంగు పరము,
పరము గాంచిన శివుడన బరగు వేమ!'

సాధు సాంగత్యంవల్ల శాంతం, శాంతం వల్ల చిత్తస్థైర్యం చిత్తస్థైర్యం వల్ల పరం, పరమ పదంవల్ల శివైక్యం కలుగుతాయి.

'సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం ।
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥'

అనే శ్లోకం ఇచ్చట ఉదాహరణ యోగ్యం.

'సాధు జనుల చెలిమి చాలింపగారాదు
ప్రకృతి విడకయున్న పరములేదు
పిందె కోసి చూడ బీజంబు గలుగునా,
విశ్వదాభిరామ వినురవేమ'

కేవలం ఐహిక సుఖాలు విడిచిపెట్టినంత మాత్రాన ముక్తికాంత లభించదు. పరిపక్వత పొందని పిందెను కోసి చూస్తే బీజాలు లేనట్టే సాధుజనుల సాంగత్యం లేనివానికి పరిపక్వత సిద్ధించదు. అందుచేత మోక్ష ప్రాప్తికి ఐహిక సుఖత్యాగంతో పాటు సజ్జన సాంగత్యం అనివార్యం అన్నాడు వేమన్న.

సజ్జనులకూ దుర్జనులకూ ఉండే తారతమ్యాన్ని గూర్చి ఇద్దరు ఊహాలూ చూడండి.

'ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండు
చూడ చూడ రుచుల జాడ వేరు
పురుషులందు పుణ్య పురుషులు వేరయా
విశ్వదాభిరామ వినురవేమ!'

ఉప్పూ, కర్పూరం చూడ్డానికి ఒకే మాదిరిగా ఉన్నా, వాటిరుచులు వేరైనట్లు పురుషులందరూ ఒకే ఆకారంలో ఉన్నా, వారిలో పుణ్యపురుషులు వేరుగా ఉంటారు.

''హంసా బగులా ఏక్ సా
మానసరోవర్ మాహిం।
బగా ఢంఢోరే మాఛరీ
హంసా మోతీ ఖాహిం॥

---

1. సంసార విష వృక్షస్య ద్వేఫలే అమృతోపమే।
కావ్యామృత రసాస్వాదం సంగతి
సుజనైస్సహ॥

"సంసార విషవృక్షమునకు రెండే రెండమృత ఫలములు. కావ్యామృతరసపాన మొకటి. సత్సంగతి యొకటి"
- నీతిచంద్రిక.

# కీ॥ శే॥ విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారి

# దివ్యసంస్మరణ

ఆంధ్రదేశమున వేదశాస్త్రములలో విఖ్యాతులైన వైదికకుటుంబములు చాల కలవు. ఎక్కువమంది కోనసీమలో గలరు. వీరిలో కొంతమంది యజ్ఞయాగాదులను కూడ నిర్వహించియున్నారు. వారిలో "బులుసు" వంశీయులు ముఖ్యులు. ప్రతిభ గలవారు. చాల మంచి గౌరవమర్యాదలను సంపాదించుకొనియున్నారు. "బులుసు లేని యజ్ఞము, బులుసు లేని తద్దినము" ఉండదనే సామెత గలదు. అట్టి పవిత్ర బులుసు వంశమున జన్మించినవారు కీ॥ శే॥ బులుసు సీతారామశాస్త్రి సోదరులు. చాల ప్రతిభావంతులు, కవులు, గ్రంథకర్తలు, మేధావులు.

శ్రీ సీతారామశాస్త్రిగారు వేదశాస్త్ర పండితులు, సంస్కృతాంధ్ర విద్వాంసులు. శ్రీ వీరేశలింగము పంతులుగారి ఉన్నత పాఠశాల, కాలేజీలలో ఉత్తమశ్రేణి తెలుగు పండితులుగా చాలకాలము పనిచేసి, మంచి విద్యార్థులను తయారుచేసి, మంచి పేరు సంపాదించుకొని యున్నారు. విద్యార్థులకు తెలుగు పాఠ్యగ్రంథములు సుబోధకమగుటకు పెలుగా, అర్థవివరణ తాత్పర్యసహితముగా ప్రశ్నోత్తరమాలికా విధానమున, స్వయంకృషి చేసి విద్యార్థులు పాఠ్యగ్రంథములను చదివి పరీక్షలలో సులువుగా ఉత్తీర్ణులగుటకుగాను ఆయిదుగురు మంచి విద్వాంసులచే గైడు పుస్తకములను ప్రచురించెడివారు. ప్రతీ విద్యార్థి వీటిని కొని, చదివి, పరీక్షలు బాగుగా వ్రాసి ఉత్తీర్ణులయేవారు. ఈ గైడు పుస్తకములు విద్యార్థులకు చాల ఉపయోగపడేవి. ఈ గైడు పుస్తకముల ప్రచురణద్వారా శ్రీ సీతారామశాస్త్రిగారికి మంచి పేరు వచ్చినది. విద్యార్థిలోకమంతయు శ్రీ శాస్త్రిగారిని గౌరవించేవారు. శ్రీ శాస్త్రిగారు విద్యారంగమున మంచి విద్యావేత్తగా పరిగణింపబడేవారు.

శ్రీ శాస్త్రిగారు సంస్కృతాంధ్రగ్రంథముల నెన్నిటినో సులోతుగా పరిశ్రమచేసి పరిశోధనలు చేసి యున్నారు. ఆంధ్రదేశమున సాంస్కృతిక పత్రికలు చాల తక్కువ. పూర్వము కీ॥ శే॥ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు స్థాపించిన "భారతి" మాసపత్రిక యొక్కటే. మన ప్రాచీన గ్రంథములను, మహాకవులు రచించిన తెలుగు గ్రంథములను పరిశోధనలు చేసి రచించిన వ్యాసములను ప్రచురించి వెలుగులోనికి తీసుకొని రావలయునని సత్సంకల్పము, ఆశతో, శ్రీ శాస్త్రిగారు "సమాలోచన" యనే జాతీయ సాంస్కృతిక పక్షపత్రికను స్థాపించి నేటికి 13 సంపుటములను ప్రచురించియున్నారు. ఇది పండితులకు, కవులకు, పరిశోధన చేయు విద్యార్థులకు ఎంతగానో ఉపయోగించుచున్నది. ఇది శ్రీ శాస్త్రిగారి ప్రియమైన సాహిత్యసేవగా పరిగణింపబడు చున్నది. వారిది ప్రశంసనీయమైన గొప్ప కృషి.

శ్రీ శాస్త్రిగారికి సాంస్కృతిక రచనలయందు అపారమగు ప్రేమ. సమాలోచన పత్రిక నడుపుట వలన వారికి నష్టము వచ్చుచున్నది. అయినను లెక్కచేయక శక్తిశ్రద్ధలతో నడుపుచున్నందులకు వారిని అభినందించవలయును. సాంస్కృతిక ప్రియులందరు "సమాలోచన" పత్రిక చందాదారులుగా చేరి ప్రోత్సహించ వలసినదిగా విన్నవము చేయుచున్నాను. "సమాలోచన" చాల విలువైన పత్రిక. నేటి విద్యార్థులు సాంస్కృతిక విద్యావిషయములలో ఎక్కువగా కాలక్షేపము చేయుమని విన్నపము.

శ్రీ సీతారామశాస్త్రిగారు ప్రతి సంవత్సరము శ్రావణమాస శ్రీకృష్ణాష్టమి దినములలో వేదశాస్త్ర పండితులను తమ గృహమునకు ఆహ్వానించి చాల ఘనముగా సన్మానించెడివారు. ప్రతి నిత్యము తాము స్వయముగా వేదపారాయణము చేసేవారు.

శ్రీ సీతారామశాస్త్రిగారికి కర్ణాటక సంగీతము త్యాగరాజ కృతులన్న చాల ప్రియము. హిందూ సమాజములో జరిగే త్యాగరాజ ఉత్సవములకు తప్పక వెళ్ళి ఆనందించేవారు. సభలకు ఆర్థికసహాయము అందజేసే వారు. సంగీత సాహిత్య ప్రియులు.

శ్రీ శాస్త్రిగారు నాకు పరమ మిత్రులు. సహృదయులు. సద్గుణ సంపన్నులు. ఉదారస్వభావులు, ఉత్తమ శ్లోకులు, పుణ్యపురుషులు. నేను ప్రచురించిన "శ్రీమద్భాగవత మణిహారము" సంకలనము, ముద్రణ సమయము లలో అనేక మంచి సలహాలనిచ్చేవారు. వారి అమూల్యాభిప్రాయము, ఆశీస్సులను వాటియందు ప్రచురించే అదృష్టము కలిగి పరమ సంతోషము నొందియున్నాను.

శ్రీ శాస్త్రిగారి నిర్యాణము ఆంధ్రదేశమున విద్యారంగమునకు, సాంస్కృతిక కార్యక్రమములకు, వేదశాస్త్రములకు తీరని లోటు. వారి ఆత్మకు శ్రీ భగవానుడు శాంతి ప్రసాదించుగాక. పవిత్ర బులుసు వంశీయులు, "సమాలోచన" పక్ష పత్రికలు వర్ధిల్లుగాక—

శ్రీ శాస్త్రిగారి దివ్యసంస్మరణము చేయుచు, శ్రీ శాస్త్రిగారి కుటుంబ సభ్యులందఱకు నా ఆశీస్సులను అందజేయుచున్నాను.

—ఆచార్య దర్భా సూర్యనారాయణ

మృత్యుఫణీంద్ర పూత్కృతియె యద్ది ?
తుపానొకో ? గ్రామవాసముల్
వ్యత్యయ మయ్యెఁ ; తీర కణవై
బ్రతుకే బరువై విషాద సా
హిత్య రసస్వరూపముగ విప్పుడు
తప్పదు సాగరాంధ్రి ; సా
హిత్యము మీఱ సాయ మొనరింపుడు ;
పెంపుడు భ్రాతృభావమున్.

వత్సరమందు నాల్గు తడవల్ పయపేయు
తుపాను ; పేయు నీ
తత్ప్రము ; కాన మింతటి యుపద్రవ
మింతకు మున్న ; నాయకుల్

## తుపాను తుపాను

—డా॥ చేరెడ్డి మస్తాన్ రెడ్డి

మత్సరముల్ వివాదములు మాని
ప్రజాహితదీక్ష బూని సం
విత్సముదీర్ణ కావన గమించినచోఁ
గుమమిందు ప్రమోదులన్.

అసలు తుపానబాధితుల నావల ద్రోసి,
ధనాబలంబుతో
మసలెడివారలం దలఱ మార్చెడివారిని
నమ్మి, లేఖకుల్

దొసగులు చేయ దిద్దుటకు త్రోవలు
చూడక రోడ్డు కడ్డమై
మసలుట బస్సులాపుట విమూఢత
రాలను రువ్వుటొప్పునే ?

చందాల పేరుతోడ స
దందుగ తమ పొట్ట నింపు సన్నాసుల మీ
కెందైన తారసిల్లిన
వందింపుడు వారి జాడ లధికారులకున్.

పాత్ర మెఱిఁగి విత్తంబును క్షేత్ర మెఱిఁగి
విత్తనము జార్చ ఫలితంబు వెలయుఁగాన
దానవీరులు ! మీర లీ తత్త్వ మెంచి
మంచి వ్యక్తుల సంస్థల నెంచుకొనుడు.

# నన్నయభట్టారకుని
## భారత సూక్తిరత్నములు

క్రోధము తపముం జెఱుచును
గ్రోధము యణిమాదులైన గుణములఁ
బాపున్
గ్రోధము ధర్మ క్రియలకు
బాధయగుం గ్రోధిగాఁ దపస్వికిఁ జన్నే.
ఆది 2_174

క్రోధము తపస్సును చెడఁగొట్టును. క్రోధమే అణిమ మొదలగు అష్టసిద్ధులను పోఁగొట్టును. ధర్మకార్యము అన్నిటికిఁ గోపము హాని కలిగించును. కోపము తపస్వి కెంతమాత్రమును దగదు.

క్షమలేని తపసి తపము
ప్రమత్తు సంపదయు ధర్మబాహ్యప్రభు రా
జ్యము భిన్నకుంభమున తో
యము లట్టుల యధ్రువంబులగు వివి
యెల్లన్.
ఆది 2.175

ఓరిమిలేని ముని తపస్సును, మిక్కిలి గర్వించినవాని సంపదయు, ధర్మవిరుద్ధమైన నడవడిగల ప్రభుని రాజ్యమును- పగిలిన కడవయందు నీరు నిలువనివిధముగ - నిలువఁజాలవు (నశించును).

సంకలనం :
శ్రీ॥ శ్రీ॥ విద్వాన్
బులుసు సీతారామశాస్త్రి

ఎంత శాంతు లయ్యు నెంత జితేంద్రియు
లయ్యుఁ గడు వివిక్త మయిన చోట
వతుల గోష్ఠిఁ జిత్తచలన మొందుదు
రెందుఁ
గాము శక్తి నోర్వఁగలరె జనులు?
ఆది 3_38

మిక్కిలి శాంతస్వభావము గలవారు, ఇంద్రియములను జయించినవారుఁ గూడ ఏకాంతమున స్త్రీలతో గోష్ఠి జరిపిన; వారిమనసు చలించును. ఎవరును మన్మథుని శక్తిని గెలువఁజాలరు.

దివిజ మునీంద్ర దానవ ది
తి ప్రభవాది సమస్త భూత సం
భవముఁ గృతావధాను లయి
భక్తి మెయిన్ వినుచున్న పుణ్య మా
నవులకు నిక్కువంబగు మ
నః ప్రియ నిత్యసుఖంబులుం జిరా
యువు బహుపుత్త్రలాభ విభ
వోన్నతియున్ దురిత ప్రశాంతియున్.
ఆది 3_72

దేవతలు, మునులు, దానవులు, దైత్యులు, మున్నగు సమస్త ప్రాణుల ఉత్పత్తియు (పుట్టుకయు) శ్రద్ధాభక్తులతో వినుచుండు పుణ్యాత్ములగు మానవుల మనస్సునకుఁ బ్రీతికరములగు నిత్యసుఖములును, దీర్ఘాయుర్దాయము, బహుసంతానలాభము, గొప్ప సంపదలు, పాప పరిహారము తప్పక సంఘటిల్లును.

మొదలి పెక్కుజన్మములఁ బుణ్య
కర్మముల్
వరగఁ బెక్కుచేసి వడయఁబడిన
యట్టి యెఱుక జనుల కాక్షణమాత్రన
చెఱుచు మద్యసేవ సేయ నగునె?
ఆది 3_120

ఎన్నో పూర్వజన్మములలో అనేక పుణ్యకర్మములు చేసి పొందిన జ్ఞానము మద్యసేవవలన క్షణమాత్రములో నశించును గావున మద్యము సేవించుటతగదు.

(సశేషం)



# B. V. & Co.

రాజమండ్రి.

# FIVE PANDITS

X Class Best Telugu Notes

X Class Hindi Golden Notes

X Class Telugu Question Bank

X Class Hindi Test Papers

I Year Intermediate Telugu Full Notes

II Year Intermediate Telugu Full Notes

II Year Inter Dharma Vijayam Notes

I Year Degree Telugu Full Notes with Text

II Year Degree Telugu Full Notes

II Year Degree Vara Vikrayam Notes

చదవండి!

అత్యధిక మార్కులతో విజయం పొందండి.

అనుకరణములకు మోసపోకండి.